## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 6020010002325

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# వివాహం సంతానంకోసమేనా?

సంకలన కర్త:

## మల్లాది సుబ్బమ్మ

అభ్యుదయ వివాహ వేదిక

# ఇందులో...ఇదీ వరుస

# మానవ వాహిని ప్రమాదం :
## ముందుచూపు

పరిస్థితులు విషమిస్తున్నా నిర్బంధ కుటుంబ నియంత్రణ అమలు జరపటానికి మనవారు సుముఖత చూపడంలేదు. ప్రజాస్వామికం కనుక నిర్బంధ విధానాన్ని అనుసరించరాదనే వాదనలో కొంత బలం వుంది. కాని ప్రమాదం ముంచుకొస్తున్న ఈ తరుణంలో దురభిమానాలకు, అనుమానాలకు ఇక తావులేదు. అంచనాలను, పథకాలనూ తలక్రిందులు చేస్తోంది మన జనాభా ప్రళయం.

క్రీ. పూర్వం 1800 నాటికి 5 లక్షలున్న ప్రపంచ జనాభా క్రీస్తు పుట్టేనాటికి కోటికి పెరిగింది. 1492 కు 32 కోట్లయింపల్లా 1930 నాటికి నూరు కోట్లయి 1940 నాటికి 214 కోట్లకు పెరిగింది. 1971 కి 300 కోట్ల సంఖ్య అయి ఈనాడు 400 కోట్లు దాటింది. 2 వేల సం॥ నాటికి 620 కోట్లను సమీపిస్తుందనేది నిర్వివాదాంశం. 4 వేల నాటికి గాలి పీల్చుకోటానికి స్థలం కూడా కరువవుతుందని, 6 వేల సం॥ నాటికి కదలటానికే చోటు వుండదని, 8 వేల నాటికి ఈ ప్రపంచమే ఒక పుట్టుకురుపయి అందులో మానవు డొక "సెల్" గా మారిపోతాడని గణతంత్ర శాస్త్రజ్ఞులు లెక్కలు కట్టారు. అంకెల అంచనాలలో తేడాలు వుండనచ్చు. కాని ఈ పెరుగుదల వల్ల మానవుడు అర్థవంతమైన, ప్రయోజనకరమైన జీవితాన్ని గడపలేడు. ఇప్పటికే విద్య, ఉద్యోగ, ఆహార వసతులు మృగ్యమవుతున్నాయి. జైల్లో నేరస్తునికి సైతం 12 ఔన్సుల ఆహారం ఇవ్వాలని ఆదేశం వుంది. అయినా ఈ నాటి సగటు మనిషి 10 ఔన్సులకు కూడా నోచుకోని దుర్భర పరిస్థితి ఏర్పడింది. ఏటా పెరిగే జనాభా అవసరాలు తీర్చాలంటే ఒకటిన్నర లక్షల పాఠశాలలు, మూడు లక్షల ఉపాధ్యాయులు, 25 లక్షల మందికి ఉపాధి, ఇళ్ళు, హాస్పిటల్సు, నీరు, కంరెటు లాంటివి నెలకొల్పాలి. ఈ పని అసాధ్యమని తేలిపోయింది.

జనాభా పెరుగుదలకు కారణా లనేకం వున్నాయి. మతవాదుల వ్యతిరేక ప్రచారం, కార్మికవర్గ నిర్లక్ష్య ధోరణి, మధ్యతరగతి నిస్తేజం, ప్రభుత్వ విధానాలు తరచు మార్పు చెందటం లాంటివే కాక కలరా, మశూచి లాంటి అంటువ్యాధుల నివారణ నూతన ఔషధాల అన్వేషణ, క్షామాలు, వరదలను అరికట్టడం, ఆరోగ్య పథకాల లాంటి విధానాలవల్ల మరణాల రేటు తగ్గింది;

జననాల రేటు పెరిగింది. వసుధైక ప్రభుత్వం కావాలని నినాదాలు చేసే దేశాలు సైతం ఇతర దేశాల జనాభాను కొంతైనా తమ దేశానికి ఆహ్వానించగల మానవతా భావం, అంతర్జాతీయ భావన కలిగి లేవు. తమ దేశ జనాభా పెర గాలని కోరే దేశాలు కూడా భారతీయులను గెంటివేయడం చూస్తున్నాం. ఇలాంటి స్థితిలో ఇంకా తటపటాయించడం అనవసరం.

వ్యక్తి కోరేది ఆనందం. ఇది బహుముఖాల దర్శన మిస్తుంది. అంటే అడ్డంకులను అధిరోహించగల్గడంవల్లనే అది లభిస్తుంది. ఒకనాడు బిడ్డలు పర ప్రసాదమని నమ్మేవారు. కావాలన్నా, వొద్దన్నా అది మన పూర్వజన్మ సుకృతం వల్లనే జరుగుతుందని భ్రమపడేవారు. అలా వాదించేవారు ఈ నాడూ వున్నారు. ఈ నాటి శాస్త్రీయ విజ్ఞానం విశ్వ కవాటాలను భేదించింది. ఒకనాడు చంద్రుణ్ణి దేముడని పూజించినవారు ఈనాడు అది ఒక గోళమని గుర్తించారు. ఈ పరిణామం వల్ల మన విలువల్లో అనేక మార్పులు వొస్తు న్నాయి. అందుల్ల అన్నింటికన్నా ముఖ్యమైనది పరిమిత కుటుంబం, ఆ లక్ష్యసాధన కోసం మన సనాతన సంప్రదాయ సిద్ధాంతాలలో మార్పు రాక తప్పదు. పరిస్థితిని పునః పరిశీలన చేసుకోక తప్పదు.

నిర్బంధ కుటుంబ నియంత్రణ గురించి ఆలోచిస్తే రాజ్యాంగ పరంగా కూడా తప్పుకాదు. ఆదేశిక సూత్రాల ప్రకారం ప్రభుత్వం ప్రజల ఆరోగ్యాన్ని, ఇతరత్రా అభివృద్ధి పరచాల్సిన బాధ్యతను 47వ అధికరణం స్పష్టం చేస్తున్నది. సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయాలు విలసిల్లే వ్యవస్థ నిర్మా ణానికి విధిగా దోహదం చెయ్యాలని రాజ్యాంగపు 38వ సూత్రం నిర్దే శించింది. భావ, మత స్వాతంత్ర్యాలు మౌలిక హక్కులుగా గుర్తింపబడినా అవి నిర్నిబంధమైన హక్కులు కావు. ప్రజా భద్రత, నైతిక సూత్రాలు, ఆరోగ్యం లాంటి వాటికి లోబడే మనం ఆ హక్కులను కోరాలి. కనుక మన ఉనికికే ప్రమాదం సంభవిస్తున్న ఈ తరుణంలో నైతిక సూత్రాలకు కూడా చెందని మత సూత్రాలను పాటించాల్సిన పనిలేదు. నిర్బంధ చర్య లకు, లౌకిక వ్యవహారమైన బిడ్డలను కనడంపై అదుపుకు రాజ్యాంగంలో 25వ అధికరణ ద్వారా రాజ్యానికి అధికారం వుంది. కనుక రాజ్యాంగ సవరణ కూడా అవసరంలేదు. కనుక కావాల్సిందల్లా ప్రభుత్వాల సంకల్ప బలం, ప్రజల ప్రోద్బలాలు మాత్రమేనని మనం గమనించి ఒక్క పిల్లతో నిర్బంధంగానైనా కు. ని. అమలు పరచక తప్పదు.



# చిన్న కుటుంబం - ప్రచారావశ్యకత

## ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీమతి కుముద్ బెన్ జోషి

## ప్రారంభోపన్యాసం

'కుటుంబ సంక్షేమం : స్త్రీలపాత్ర' అనే విషయంపై జరిగే ఈ సదస్సును ప్రారంభించమని కోరినందుకు హైదరాబాద్ నగర పాలక సంస్థకు చెందిన కుటుంబ సంక్షేమ సంస్థ వారికి, అం. ప్ర. అభ్యుదయ వివాహ వేదిక వారికి నా ధన్యవాదాలు. ఈ సదస్సుయొక్క కేంద్ర అంశం చాలా అర్థవంతమైనది. కుటుంబంలో శిశువు పుట్టటం ఒకనాడు తల్లిదండ్రులకు ఆశాజనకంగా ఉండేది. ఈనాడు పరిస్థితి వేరు. కుటుంబానికేకాక దేశానికి కూడా భారంగా పరిగణించబడుతున్నది. జనాభా విపరీతంగా పెరుగుతుండడంతో ఈ భావం ఉదయిస్తున్నది. మానవ జీవితాన్ని సుసంపన్నం చేయడం, ప్రతి వ్యక్తికీ ఇతోధిక అవకాశాలు గ్యారంటీ చేయడం, జీవన ప్రమాణాలను పెంచడం, స్త్రీ పురుషులందరూ వ్యక్తిత్వ హుందాను పొందటం ఇవన్నీ 'కుటుంబ సంక్షేమం' అనే భావనలో ఇమిడి ఉన్నాయి. వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేస్తుంది కుటుంబ సంక్షేమం. మానవుని సామాజిక, ఆర్థిక, వ్యక్తిగత, జాతీయ జీవితాలను ఇది ప్రభావితం చేస్తున్నది. ఒక్కమాటలో చెప్పాలంటే, జాతి శాంతి సౌభాగ్య అభ్యుదయాలు జనాభా పెరుగుదలను మనం అదుపులో పెట్టుకోగల శక్తిపై ఆధారపడతాయి.

ఆర్థికాభివృద్ధికి తప్పనిసరియైన జనాభా అదుపుయొక్క ప్రాముఖ్యతను గుర్తించిన ప్రపంచం 'చిన్న కుటుంబం' అనే ఆదర్శాన్ని ఎక్కువగా ఆదరిస్తున్నది. ప్రభుత్వం ద్వారా సహాయ సహకారాలను అందిస్తున్న మన దేశం ఈ నినాదానికి క్రొత్త అంతస్తును కలుగజేసింది. ముప్పది నలుబది ఏండ్ల నాడు కేవలం కుటుంబ నియంత్రణపు అమలుకుఎక్కువ ప్రాముఖ్యతను ఇచ్చేవారు. ఈనాడు కుటుంబ నియంత్రణ, కుటుంబ సంక్షేమం రెండూ ప్రాధాన్యత వహి-

స్తున్నాయి. గత రెండు దశాబ్దాల నుండి ఈ కార్యక్రమానికి బలం, ప్రోత్సాహం సమకూరాయి. సమస్యను ప్రత్యేకంగా విడదీసి చూడకుండా సంపర్క దృష్టితో సమగ్ర దృక్పథంతో పరిశీలించటమే దీనికి కారణభూతం అయింది.

ప్రజలు కుటుంబ సంక్షేమం విషయమై జాగృతి పొందితే తప్ప, దానిని తమ సమస్యగా పరిగణిస్తే తప్ప, దాని సమస్యను ఆకళింపు చేసుకుంటే తప్ప, అది ఒక ప్రజోద్యమం అయితే తప్ప దానిని సరిగా అమలు పరచ లేము. దీని విషయమై స్త్రీలు ప్రదర్శించే వైఖరి జనాభా అదుపుపై ప్రభావం కలిగి ఉంటుందని స్పష్టంగా చెప్పవచ్చును. అది తమ కుటుంబానికి, సమాజానికి, దేశానికి మేలు చేకూరుస్తుందని వారు మనస్ఫూర్తిగా విశ్వసించిననాడు దానిని ఉపయోగకరంగా అమలు పరచవచ్చును.

స్త్రీల మనస్తత్వంపై వ్యతిరేక ప్రభావం కల్గించే అనేక అంశాలున్నాయని ఇటీవల జరిగిన కొన్ని పరిశోధనాధ్యయనాలవల్ల తేలింది.

చాలా మంది స్త్రీలు చిన్నకుటుంబం కావాలనే ధోరణిని ఆమోదించటం లేదు. ఆ విషయాన్ని ప్రస్తావిస్తే వారు చాలా బాధపడిపోతున్నారు. కుటుంబ నియంత్రణ విషయంపై పురుషుని వైఖరికీ, అతని భార్య వైఖరికీ విరుద్ధ భావాలుంటున్నాయి. మధ్య తరగతి కుటుంబాలు ఈ భావానికి ఎక్కువగా స్పందిస్తున్నాయి. కాగా కొన్ని మతాల వారిలో మతదృష్టి మరో వైఖరిని చేకూరుస్తున్నది. విద్యావంతులైన స్త్రీలు ఈ సమస్యను హేతుయుక్తంగాను, బుద్ధి ప్రామాణ్య పద్ధతితోను ఆలోచించగల శక్తి కలిగి ఉన్నారు. విద్యావంతులు కాని స్త్రీలు ముఖ్యంగా గ్రామాలలోనివారు-వ్యతిరేక వైఖరిని ప్రదర్శిస్తున్నారు. వారి ఆలోచనలు మార్పును ఆహ్వానించడంలేదు. పెద్ద కుటుంబం సంపదను తెచ్చి పెట్టుందని, వృద్ధాప్యంలో తల్లిదండ్రులకు రక్షణయని వారి భావం.

ఈ విభిన్న దృక్పథాలను, అభిప్రాయాలను వైఖరులను గమనిస్తుంటే 'చిన్న కుటుంబం' అనే లక్ష్యాన్ని స్వీకరించటానికైనా లేక తిరస్కరించటానికైనా స్త్రీలే ముఖ్య పాత్రధారులు కాగలరనే భావం మనకు కలుగుతుంది. 'చిన్న కుటుంబం' అనే పద్ధతి వల్ల లాభాలు ప్రయోజనాలు ఒనగూడుతాయని' అది దేశాభ్యుదయానికి, దేశ సౌభాగ్యానికి దోహదం చేస్తుందని, జీవితాన్ని

సుసంపన్నం చేస్తుందని స్త్రీలకు గ్రహింపజేసి వారిలో వినూత్న జాగృతి కలిగించడం అవశ్య కర్తవ్యం. జనాభా పెరుగుదలవల్ల జాతీయ ఆర్థిక వ్యవస్థకు కలిగే ముప్పును గురించి కూడా వారికి తెలియజెప్పాలి.

స్త్రీలు ఇష్టపూర్వకంగా చేపట్టినప్పుడే కుటుంబ నియంత్రణ, కుటుంబ సంక్షేమం వాస్తవ రూపం తాలుస్తాయనే భావాన్ని ప్రజలలో ప్రచారం చేయాలి. స్త్రీలకు ఆ కార్యక్రమం యెడల సుముఖతను నిర్మించాలి. స్వచ్ఛంద సంస్థల ప్రతినిధులు, మహిళా సంఘాల నాయకులు ఇక్కడ సమావేశమై ఈ అభిప్రాయాన్ని తమదిగా చేసుకుంటే వారు ఇతరులకు నచ్చజెప్పగలరు. పట్టణ ప్రాంతాలలో చిన్న కుటుంబపు ఆవశ్యకతను తేలికగా స్త్రీలకు తెలియజేయగలం. నగర వాసులు, పట్టణ వాసులు, జీవిత వాస్తవాలను ఎక్కువగా గ్రహించగలిగి ఉంటున్నారు. కొద్దిపాటి ఆదాయంతో పెద్ద కుటుంబాలను పోషించుకొనటం నేడెంత కష్టమో వారికి తెలుసు.

ప్రభుత్వం ఇస్తున్న వనరుల దృష్ట్యా, కుటుంబ సంక్షేమ కేంద్రాల కృషివల్ల చిన్న కుటుంబం కావాలనే సందేశం ప్రజలలోకి వెళ్తున్నది. ఈ సదుపాయాలను వినియోగించుకోవటానికి ప్రతివ్యక్తికీ సంకల్ప బలం ఉండాలి. ఆ సందర్భంగా వారికి తగిన ప్రోత్సాహం లభించాలి. మహిళోద్యమ కార్యకర్తలు ఈ కృషిని చేపట్టి స్వచ్ఛంద సంస్థల సహకారాన్ని పొందాలి. వీధి వీధికి తిరిగి ఈ సందేశాన్ని అందించాలి. జంటనగరాలలో వంధ్యాకరణ శస్త్ర చికిత్సను చేపట్టవలసిన కుటుంబాలు సుమారు 3 లక్షల వరకూ ఉన్నాయని తెలుస్తున్నది. సమస్య యొక్క బృహత్తర స్వరూపం గమనిస్తే ఇది ఏమంత పెద్ద సంఖ్యకాదు.

ఈనాడు క్రొత్త వ్యూహాన్ని చేపట్టాం. కుటుంబం యొక్క యావత్తు సంక్షేమాన్ని లెక్కలోకి తీసుకుంటున్నాం. తల్లి ఆరోగ్యం, శిశుపోషణ, గర్భిణీస్త్రీ ఆరోగ్యం, పోషకాహారం ఇవన్నీ దీని క్రిందికి వస్తున్నాయి. కుటుంబ సంక్షేమ కార్యక్రమం కష్టసాధ్యమే, కాదనను. ప్రజలలో నుండి చొరవ, పూనిక, నూతన నాయకత్వం ఈ కార్యక్రమ నిర్వహణకు అవసరం. ఈ సదస్సు స్త్రీలలో నూతన నాయకత్వం ఉద్భవించటానికి ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాను. ఈ కృషి విజయవంతం కావాలని ఆకాంక్షిస్తున్నాను.

జై హింద్

# కుటుంబ నియంత్రణం: ఎవరి కోసం? ఎందు కోసం?

మల్లాది సుబ్బమ్మ

పవిత్రతకు, త్యాగానికి చిహ్నం స్త్రీ అని, ఆమె వంశోద్ధారకురాలని, ముఖ్యంగా పుత్రుణ్ణి కని పున్నామ నరకం నుండి తప్పిస్తుందని, అందువల్ల స్త్రీని పూజించాలి, గౌరవించాలి అనే ఆర్యోక్తి ఇంకా ప్రచారంలో వుంది. అందువల్లే స్త్రీని పుత్రపౌత్రాభివృద్ధిరస్తు అని ఆశీర్వదిస్తూ వుంటారు. ఆ పరిస్థితులు మారినా, ఆ భావాలు, ఆ వాసనలు మన్నింకా వెంటాడుతూనే వున్నాయి. స్త్రీ అంటే కేవలం బిడ్డల్ని కనడానికి పనికివచ్చే ఒక సాధనమనే ఆలోచన నాటి నుండి నేటి వరకు మనవారి మనఃకుహరాలలో నాటుకుపోయింది. ఆమెకు ఇష్టమున్నా లేకున్నా పుత్రుడు పుట్టేదాకా కనవలసిందే. ఒక వేళ ఆమె ఆ కర్తవ్యాన్ని నిర్వహించలేకపోతే శనిలా దాపురించిందని, చస్తే మళ్ళీ పెళ్ళాడవచ్చుననే పెద్దలున్న సమాజం మనది. ఈనాడు ఆ సాంప్రదాయ భావాలపై మన స్త్రీలు కొందరు తిరుగుబాటు చేస్తున్నారు; వారి ప్రవృత్తులు మారుతున్నాయి. వారి కోర్కెలు, ఆలోచనలు క్రొత్త పుంతలు త్రొక్కుతున్నాయి.

"మేమెందుకు చదువుకోకూడదు? ఉద్యోగాలెందుకు చేసుకోరాదు? మా జీవిత భాగస్వాములను మేమెందుకు ఎన్నుకోరాదు? మా భర్తలు వారి కొరకు టీ తయారు చేసుకుంటే తప్పా? సామాజికాభివృద్ధి కార్యక్రమాలకు మేమెందుకు దూరం కావాలి? రాజకీయాధికారాలన్నీ కేవలం పురుషులకే పూర్తిగా ఎందుకు చెందాలి? ఉత్పత్తి రంగాన్ని మాకు దూరంగా ఎందుకు వుంచుతున్నారు? పైగా మమ్మల్ని 'పేరాసైట్సు' అంటూ ఆక్షేపించటం ద్వంద్వనీతి కాదా? అని ఆధునిక మహిళలు ప్రశ్నిస్తుంటే చూసి చూడనట్లు, విని విననట్లు నటిస్తున్నారు.

ఈనాటి స్త్రీ విశ్రాంతి కోరుకుంటోంది. ప్రజా ప్రాతినిధ్యంలో స్థానానికై అర్రులు చాస్తోంది. సామాజిక జీవితంలో ద్వంద్వ నీతిని వ్యతిరేకిస్తోంది.

కుటుంబ నిర్వహణలో, పిల్లల పెంపకంలో పురుషుల భాగస్వామ్యాన్ని కోరు కుంటోంది. ముఖ్యంగా తన వ్యక్తిత్వం స్వేచ్ఛ, సమానత్వాన్ని ఆకాంక్షి స్తోంది. ఆఖరికి పిల్లల్ని కనాలన్నా వొద్దన్నా, ఎందర్ని కనాలి, ఎప్పుడు కనాలి అనే విషయాలన్నీ తన ఇష్టం మీద ఆధారపడి వుండాలని అభిలషి స్తోంది. అలాగే గర్భస్రావ విషయంలో కూడా "పిండాన్ని మోసేది, కనేది నా శరీరం. పిండం అంటే నా శరీరంలో భాగం పిల్ల పుట్టకముందు దానికి వునికి లేదు. పుట్టాక చంపితేనే నేరం, దోషం. కూడా అంతకుముందు నా ఇష్టా ఇష్టాలపై ఆధారపడి వుండాలి అని వాంఛిస్తోంది. ఇవి ఈనాటి నూతన వనిత ఆలోచనలు.

కుటుంబ సంక్షేమానికి, కుటుంబ నియంత్రణకు సంబంధమేమిటి? మహిళా వికాసానికి ప్రస్తుత వ్యవస్థ ఆటంకంగా వుందా? అందుకు ఆర్థిక, సాంఘిక, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక రంగాల్లో ఎలాంటి మార్పులు రావాలి. అందులో మహిళోద్యమ పాత్ర ఏమిటి అనేవి ఈనాడు మన ముందున్న ప్రశ్నలు.

సంక్షేమం అంటే సర్వతోముఖమైన శ్రేయస్సు అని నిర్వచిస్తున్నాం. భార్య, భర్త, పిల్లలూ అంతా సుఖసంతోషాలతో తృప్తిగా జీవిస్తున్న కుటుం బాన్ని మాత్రమే సంక్షేమ కుటుంబం అనడం సమంజసం. అధిక సంతానాన్ని కన్న తల్లి ఆ సంక్షేమానికి దూరమవుతుంది. పురుషుడు భారమైన సంతా నాన్ని మోయలేక ఆర్థికంగా మాత్రమే కృంగిపోతాడు. కాని స్త్రీ తన ఆరో గ్యాన్ని, శక్తి సామర్థ్యాలను కూడా నష్టపోతుంది. తన యవ్వనదశ అంతా బిడ్డల్ని కనడం, పెంచడంతోనే సరిపోతుంది. ఇంకా ఆమె తన బిడ్డల స్థితికి, తన దైన్యావస్థకు తట్టుకోలేక మానసిక క్లేశాన్ని అనుభవిస్తుంది. కొన్ని సంద ర్భాలలో ఆమె మనోవైకల్యాన్ని పొందే ప్రమాదం కూడా వుండి. రక్తహీనత వల్ల ఇతర కారణాలవల్ల జీవచ్ఛవమై పోతుంది. కనుక కుటుంబ సంక్షేమానికి అధిక సంతానం తీరని నష్టాన్ని కలిగిస్తుంది అనేది సత్యం.

విశ్వమానవ కల్యాణానికి, మానవ సంక్షేమానికి ప్రజాస్వామిక వ్యవస్థ ప్రశస్తమైనది. అందులో ప్రజలే పాలకులు, పాలితులుకూడా. ప్రజాస్వామికం పటిష్ఠంగా వుండాలంటే స్త్రీ పురుషులిద్దరూ పౌరులుగా బాధ్యతాయుతంగా ప్రవర్తించాలి. తమ హక్కులను, బాధ్యతలను గుర్తించాలి; అనుభవించాలి.

ముఖ్యంగా సగభాగమైన స్త్రీలు ఈ విధిని విస్మరిస్తున్నారు. దానికి కారణం- విశ్రాంతిలేమి వల్ల స్త్రీ తన జీవిత ముఖ్యభాగమంతా పిల్లలను కనడం పెంచడం వల్ల తగిన విద్య, విజ్ఞానాలకు దూరమై పోవడం జరుగుతుంది. ఇంతేకాదు తన పిల్లలను గొప్ప పౌరులుగా తీర్చిదిద్దుకోగల అవకాశం ఆమెకు దుర్లభమవు తోంది. ఈ కారణాలవల్ల ప్రజాస్వామ్య వ్యవస్థే భగ్నమయ్యే ప్రమాదం వుందనేది ముందుగా మనం గ్రహించాలి.

సామాజిక పరమైన మూఢాచారాలవల్ల స్త్రీ తన వ్యక్తి వికాసాన్ని కోల్పో తోంది. గర్భస్రావం పాపమని, భ్రూణహత్యతో సమానమనే మతాచారం ప్రబలంగా వుంది. దైవేచ్ఛ ప్రకారం బిడ్డల్ని కనాలని 'నారు పోసినవాడే నీరు పోస్తాడని', దేశరక్షణకు అధిక జనాభా కావాలని, ఇది ప్రకృతి సహజ మని, ఆపరేషన్లవల్ల శారీరక, మానసిక వైపరీత్యాలు వస్తాయనే వాదనలు ప్రబలంగా వున్నాయి. సంస్కారులు మాత్రమే కుటుంబ నియంత్రణను ఆచరించటంవల్ల వారి సంఖ్య తగ్గడం వల్ల పుట్టబోయే మేధావులను నశింప జేసుకుంటున్నా మంటూ కొందరు గగ్గోలు పెడుతున్నారు. బిడ్డడు పుడితే బేడ డబ్బులొస్తాయనే భ్రమ ఇంకా కార్మికవర్గంలో వుంది. ఇంకా ధనవంతులైన పురుషుల్లో మాకేం మేం పోషించగలం అనే ధీమాతో తల్లి ఆరోగ్యాన్ని పట్టించుకోని వారు కొందరున్నారు. ఈ పరిస్థితులకు 'యెర' అయ్యేది, నాశనమయ్యేది స్త్రీలు కాక మరెవ్వరు ? అందువల్ల సమాజ కబంధ హస్తాలకు బలి అయ్యేది స్త్రీలే అయినా దాని ఫలితం సమాజాన్ని, కుటుంబాన్ని నిర్వీర్యం చేస్తుంది. ఈ భయంకర సత్యాన్ని గ్రహించని పురుషులకు మాత్రం విముక్తి వుంటుందా ? ఇది మరో భయంకరమైన సత్యం

సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో మార్పులు రావాలంటే వాటి వల్ల బాధితులైన వారిలో మార్పు, స్పందనం రావాలి. అందుకు ముందుగా ఆయా రంగాల్లో అనుభవజ్ఞులు, శేముషీ ధురంధరులైన వ్యక్తులు ముందుకు రాకి సోదర బాధితులను చేరదీయాలి. వారికి ఈ వ్యవస్థ తమను ఎలా వేధిస్తున్నదో తెలియ జెప్పాలి. అంటే కుటుంబనియంత్రణ వ్యక్తిగత వ్యక్తికి సంబంధించినదనే విషయాన్ని మోటివేషన్ ఎడ్యుకేషన్ల ద్వారా వారికి నచ్చ చెప్పాలి. ఇలాంటి కార్యక్రమాలు నిర్వహించాలంటే వ్యక్తుల ద్వారా మాత్రమే కాక సంఘాల ద్వారా కూడా చేపట్టాలి. మహిళా సంఘాల స్థాపన జరగాలి. మహిళోద్యమంతో కుటుంబ నియంత్రణ ప్రముఖ పాత్ర వహించాలి.

అలాంటి స్వచ్ఛంధ సంస్థల ద్వారా దంపతులను కుటుంబ నియంత్రణను పాటించమని ఉద్బోధించడం, ప్రేరేపించడం, నచ్చచెప్పటం, ముఖ్యంగా స్త్రీలను ఈ విషయమై ఆలోచింప జేయటం జరగాలి. అపోహలకు తావులేదని, ప్రమాదాలకు ఆస్కారం లేదని చెప్పాలి. వారిలో వున్న స్తబ్ధతను పోగొట్టిననాడు వారికి వారే ముందంజ వేస్తారు. "నా బ్రతుకు బాగుపడాలంటే, నేను సమాజ సేవ చేయాలంటే, నా వృత్తిలో నేను ప్రావీణ్యత పొందాలంటే, నేను రాజకీయాలలో ప్రవేశించాలంటే, నేను ప్రయోజకురాల్ని కావాలంటే, నా ఆరోగ్యం గురించి నాలో ఆందోళన నశించాలంటే ఒకటేమిటి సర్వ విధాలా నా భవిష్యత్తును నేను చక్కదిద్దుకోవాలంటే నాకు నేనై నా కుంటుంబాన్ని సంస్కరించుకోవాలి ఈ విషయంలో పెద్దలు పేచీ పెట్టినా భర్త వ్యతిరేకించినా నేను నచ్చచెప్పుకోవాలి, అంతగా వారు వద్దని గర్జిస్తే ఎదురొడ్డి అయినా నా కోసం నేనుగా పాటిస్తాను" అనే పద్ధతిలో స్త్రీలు తోటి స్త్రీలలో ఆందోళనను, ఆలోచనను, చిత్తశుద్ధిని కలిగించాలి.

ప్రభుత్వం చేయని పనిని, లేక ఎక్కువ సమర్ధవంతంగా చేయలేని పనిని మహిళోద్యమాలు నిర్వహించగలవు. ప్రజల అభిప్రాయాలను, వైఖరులను, ఆచారాలను మార్చడం మామూలుగా ప్రభుత్వానికి కష్టతరమైన విషయం. ఈ ప్రచారాన్ని కేవలం ప్రభుత్వం మాత్రమే నిర్వహించటం అసాధ్యమైన విషయం. ప్రజలలో ప్రభుత్వ కార్యక్రమాలు కేవలం డ్యూటీగా మాత్రమే చేస్తారనే అపప్రధ వుంది. అందువల్ల స్వచ్ఛంధ సంస్థలు, మహిళలు ఈ కార్య భారాన్ని నెత్తిన వేసుకోవాలి. యువతులకు, అవివాహితులకు భారీ ఎత్తున ప్రచారం చెయ్యాలి. కుటుంబ నియంత్రణ అమలు, ప్రచారం చాలా సున్నితమైన విషయాలు. ప్రభుత్వ యంత్రాంగం పట్టువలతో పని చేసినా ప్రజల సహకారం లేనిదే ఈ ఉద్యమం ఫలించదు. అందువల్ల ప్రజలే పాత్రధారులు, సూత్రధారులు కావాలి. ఇది మనందరి సమస్య. దేశ సమస్య. ప్రపంచ సమస్య కూడాను.

ఇది స్త్రీల విముక్తి ఉద్యమం. స్త్రీకి శారీరక మానసిక విశ్రాంతి కావాలంటే ఆమె విధిగా సంతానాన్ని అదుపులో పెట్టుకోవాలి. ఆమె ఆరోగ్యం కోసం, విద్య కోసం ఉద్యోగ నిర్వహణ కొరకు, విజ్ఞాన సముపార్జన కొరకు

అధిక సంతానవతి కారాదు. తన పురోగతికి తన బిడ్డల భవిష్యత్తుకు, సమాజ సంక్షేమానికి జననాలపై అదుపు పెట్టక తప్పదు.

దేశ విభజన నాటికి 30 కోట్లున్న మన జనాభా ఈనాడు 70 కోట్లయింది. వీరందరికి విద్య, ఉద్యోగం, తిండి, ఆరోగ్యం సమకూర్చాలంటే ఏ ప్రభుత్వానికైనా వెంటనే అసాధ్యమే. అందువల్ల ప్రజానీకం ఈ విషయమై కూడా శ్రద్ధ వహించాలి. తమ సంతానాన్ని తగ్గించుకోవటం ఈ సమస్యా పరిష్కారానికి ఒక మార్గం. ఇది పేరులుగా ప్రజల కర్తవ్యమనే విషయం విస్మరించరాదు. కుటుంబ సంక్షేమం, కుటుంబ నియంత్రణం లాంటి విషయాలలో స్త్రీలు ఎందుకు చొరవ చూపించాలి అనే అంశాన్ని నిర్ధారణ చేయటానికి అనేక కారణాలను చూపించవచ్చును.

కుటుంబ నియంత్రణ లైంగిక విప్లవానికి దారి తీసింది. లైంగిక ఆకర్షణ స్త్రీ పురుషుల మధ్య సహజం. దానివల్ల వచ్చే ఫలితాలను 100 కి 90 పాళ్ళు భరించేది స్త్రీ. స్త్రీ పురుషుల కలయిక - జన్మ నిగ్రహసాధనాలను పద్ధతులను వాడక పోతే - గర్భధారణకు అవకాశమిస్తున్నది. ఆమె కోరని గర్భధారణ స్త్రీకి కష్టభూయిష్టమూ, దుఃఖ భాజనమూ అవుతున్నది ఈ దుస్థితి నుండి తప్పిందుకోవాలంటే స్త్రీ కుటుంబ నియంత్రణను పాటించాల్సిన అవసరం ఉంది. కనుక కుటుంబ నియంత్రణ ఆమెకు ఎనలేని అండ దండలను అందిస్తున్నది. ఆమెను లైంగిక దాస్యం నుండి తప్పిస్తున్నది. ఇష్టం లేకున్నా ఆమె సంతానాన్ని విధిగా పొందే పరిస్థితినుండి రక్షిస్తున్నది. ఆమెకు స్వేచ్ఛను ప్రసాదిస్తున్నది, పురుషుని పెత్తందారీ తనం నుండి ఆమెకు విముక్తి కలిగిస్తున్నది. కనుక కుటుంబ నియంత్రణోద్యమం స్త్రీల విముక్తి ఉద్యమం. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం ప్రజాస్వామ్యానికి మౌలిక సూత్రాలు. కేవలం సంతానోత్పాదన సాధనంగా కాక వ్యక్తిగా స్త్రీ యొక్క హోదాను పెంచుతున్నది. కనుక స్త్రీలు కుటుంబ నియంత్రణను ఆదరించ వలసి ఉంటుందని గమనించాము. అంతేగాక ఆమె విద్యను ఆర్జించడానికి, తన సాంస్కృతిక స్థాయిని పెంచుకోడానికి తగిన విశ్రాంతిని ఆమెకు కలుగ జేయుటం ద్వారా ఆమెకు పురుషునితో సమాన హోదాను ప్రతిపత్తిని కలిగిస్తున్నది. స్త్రీ పురుష సమానత్వం వాస్తవ రూపం

తొలుస్తుంది. తన జీవిత కాలములో పిల్లలను కనడంతో, వంటింట్లో చాకిరీ చేయడంతో సరిపెట్టుకోవలసిన దుర్గతి నుండి ఆమె విముక్తికి దోహదం చేయడం ద్వారా ఆమెకు సామాజిక రాజకీయ సాంస్కృతిక జీవితంలో స్థానం, స్థాయి ఏర్పడుతున్నది. కుటుంబ జీవితంలో మగని సాహచర్యాన్ని వాస్తవమైన సన్నిహితత్వాన్ని పొందడానికి ఆమెకు వీలు కల్పిస్తున్నది. ఆర్థికంగా ఆమె తన స్థితిని మెరుగుపరుచుకోడానికి వెసులుబాటు ఏర్పరుస్తున్నది స్త్రీ ఆదాయం, పరుమానం సంపాదించుకోవటానికి ఏదైనా మంచి ఉద్యోగం చేయవచ్చును; వృత్తిని చేపట్టవచ్చును. వీలయినంతవరకు పతిపై ఆధార పడటం తగ్గించుకోవచ్చును లేక తన కాళ్ళపై తాను ఆర్థికంగా నిలబడవచ్చును. బహు సంతానవతియైన స్త్రీ కన్న, ఒకరిద్దరు పిల్లలను కలిగిన స్త్రీకి ఈ రకపు సదవకాశం ఎక్కువ. ఇలా అన్ని రంగాలలో స్త్రీ పురుష సమానత్వం తద్వారా సౌభ్రాతృత్వం వెల్లి విరుస్తాయి. సమాజాన్ని నియంత్రణం చేస్తున్న అన్ని జీవిత రంగాలలో ముఖ్యంగా సామాజిక రాజకీయ రంగాలలో చొరవ ప్రదర్శించి తనదైన సమాన స్థాయిని సాధించుకో గలదు. ఇలా ప్రజా స్వామ్య వ్యవస్థను ఆమె పోషించగలదు; పరిపుష్టం చేయగలదు.

ఈ సందర్భంలో నైతిక సమస్య కూడా ఉద్భవిస్తున్నది. బహు సంతానవతియైన స్త్రీ తన పిల్లల భారాన్ని తనపైన తన భర్త పైన మాత్రమే కాక సమాజం మీద కొంత మోపక తప్పటం లేదుకదా! ఇలా తన బాధ్యతను ఎక్కువగా ఇతరులపై రుద్దడం ఏమంత సబబు ? పిల్లలకు చదువు, ఆరోగ్యం, ఆటపాటల వసతి, సామాజిక జీవితం ఎక్కువగా ప్రసాదించగలది సమాజమని గ్రహించక తప్పదు కదా ! అలా తన చర్య ఫలితాన్ని ఇతరులపై నెట్టి వేయడం, తన బరువు బాధ్యతలను ఇతరులకు బదిలీ చేయడం అవినీతి క్రింద జమఅవుతుంది. స్త్రీ, నీతివంతురాలయితే, అలా ప్రవర్తించదు. ప్రవర్తించరాదుకూడాను.

ప్రతి వ్యక్తికి ఇష్టాయిష్టాలు, అభీష్టాలు, సంకల్పాలు ఉంటాయి. ఇతరులకు హాని, కష్టం, బాధ కలుగనంతవరకు వారిని అనుసరించటానికి, పొందటానికి ప్రతి మనిషికి హక్కున్నది. ఈ సూత్రం స్త్రీలకు కూడా వర్తిస్తుంది. స్త్రీకి అలాగే లక్ష్యాలు, ఆదర్శాలు ఉంటాయి. ఉండాలి కూడాను. వాటిని సాధించే కృషిలో చేరుకునే క్రమంలో వ్యక్తికి సంతోషమూ, తృప్తీ

ఆనందమూ ఉంటాయి. స్త్రీల పరంగా కూడా ఇది సత్యం. అంతేకాక ఏది కోసం పరితపించటంలో! శ్రమించటంలో ఆమె వ్యక్తిత్వం వికసిస్తుంది. ఆమె ప్రతిభా వ్యుత్పత్తులు వర్ధిల్లుతాయి. కుటుంబ నియంత్రణం బహు సంతాన ప్రభావం నుండి ఆమెను తప్పించటం ద్వారా ఆమెకు ఇలాంటి అర్థవంతమైన, ప్రయోజనకరమైన జీవితాన్ని గడపటానికి దోహదం చేస్తున్నది. అసలు ఆమె సంతానాన్ని పొందాలో అక్కర లేదో, కంటే ఎంత మంది పిల్లలను కనాలో, ఎప్పుడు ఆమె ఏ కాలంలో, ఏ దశలో సంతానాన్ని ఆశించాలో, పుత్రికలకు మాత్రం జన్మ ఇచ్చినా తృప్తి పడగలదో లేదో వీటన్నింటిని స్త్రీయే నిర్ణయించుకోవలసి ఉంటుంది. తన జీవిత విధానంపై తను అధికారం కలిగి ఉండటం ఆమె వ్యక్తిత్వంలో భాగం. పరాన్నభుక్కుగా పరాధీనత కల జీవిగా కాక స్వావలంబనం గల వ్యక్తిగా మనుగడ సాగించటం స్త్రీ యొక్క హక్కు. కనుక స్త్రీ వ్యక్తిత్వ వికాసానికి కుటుంబ నియంత్రణ దోహదం చేస్తున్నదనేది పచ్చి నిజం.

కుటుంబ నియంత్రణ, మాతా శిశు రక్షణ, వైద్యం, ఆరోగ్యం కుటుంబ సంక్షేమం క్రిందికి వస్తాయి. ఇవన్నీ స్త్రీకి లాభదాయకాలే. ఉపయోగకరాలే. ఈ విషయంలో ఏ మాత్రము సందేహానికి తావు లేదు. అలాంటి పరిస్థితిలో కుటుంబ సంక్షేమాన్ని గురించి స్త్రీలు, స్త్రీ సంఘాలు ఆసక్తిని, ఉత్సాహాన్ని, చొరవను, కృషిని ప్రదర్శించాల్సిన అవసరం ఎంతైనా ఉన్నది అందుకు స్త్రీలే సూత్రధారులు. పాత్రధారులు కావాలి.

# తల్లుల ఆరోగ్యం : దాని ప్రాముఖ్యత

వి. శమంతకమణి

ప్రపంచ మహిళా సంవత్సరం, దశాబ్దపు ఉత్సవాలు జరుపుకున్నాం. కాని స్త్రీ జనాభ్యుదయానికి చేయవలసింది ఇంకా ఎంతో ఉన్నదని తప్పక చెప్పాలి. అందునా స్త్రీలకు ఆరోగ్యరక్షణకై మనం చేయగలిగినంత చేయాలి.

ప్రగతి నిరోధాలైన అవిద్య, అనారోగ్యము, ఆర్థికదుస్థితి, బాల్య వివాహాలు, అపరిమిత సంతానము, వ్యవధి లేకుండ వెంట వెంటనే శిశు జననాల్లూ మొదలైనవన్నీ పరస్పరం ఒకదానిపై ఒకటి ఆధారపడి వున్నాయి

మన సమాజంలో సగంమంది స్త్రీలే. జాతి పుట్టుకకూ, జాత్యభ్యుదయానికీ స్త్రీలే వైతాళికులు. అట్టి స్త్రీ ఆరోగ్యం ముఖ్యమైన విషయం. బాలురతో సమానంగా బాలికలకు ఆహార పోషణ విద్యావకాశాలు (ముఖ్యంగా ప్రాథమిక విద్యవరకైనా) నేర్పించాలి. బాల్యవివాహాలు నివారించడం చాలా అవసరం. విద్యావకాశాలు మెరుగయితేనే బాల్య వివాహాలు తగ్గుతాయి. అంతే కాక కార్మిక స్త్రీలు పనికి వెళ్ళినపుడు పసిపిల్లల ఆలనా, పాలనా కూడా 8-10 సం॥ల ఆడపిల్లలే చూస్తుంటారు. కనుక వారికి పాఠశాల విద్య నేర్చుకునేందుకు వీలుండదు. గ్రామాలలో అందుకు శిశు విహారాలు, క్రెష్‌లు విస్తృతంగా నిర్వహింపబడాలి. అట్లయితే బాలికలు చదువుకోవడానికి అవకాశాలు పెరుగుతాయి. బాలికల వివాహ వయస్సు పెంచాలి. మన ప్రభుత్వం బాలికల వివాహ వయస్సును 16 నుండి 18కి పెంచి చట్టంగా రూపొందించారు. ఈ చట్టాన్ని ఉల్లంఘించిన వారికి, అందుకు బాధ్యులైన వారికి 6 నెలల జైలుశిక్షగాని లేక 1000 రు॥లు జరిమానాగాని లేక రెండునూ విధించవచ్చును. బాల్య వివాహాలు శిక్షార్హమేగాక, బాలికలు మానసికంగా, శారీరకంగా సాంఘికంగా వివాహితలుగా జీవన సరళిలోనే మార్పులుకూడా సర్దుబాటు చేసికొనగలగాలి.

వివాహ వయస్సుతో పాటు రక్తసంబంధీకులలో వివాహాలు వైద్యశాస్త్ర రీత్యా అమోదకరం కాదు. పుట్టే బిడ్డలలో శారీరక, మానసిక అంగవైక

ల్యాలు; స్త్రీలలో ప్రధానంగా సృజిత మొదలైనవాటిని గమనించవచ్చు. అందు వలన ఈ విధానము అనుసరణీయంగాదు.

అంతేగాక వివాహమైన వెంటనే సంతానం కలుగకుండ రెండు లేక మూడు సం॥ములు వరకు చూచుకుంటే మంచిది. ఎందుకంటే ఎక్కువ మంది తో క్రొత్తగా ఏర్పడిన బాంధవ్యాలు జీవిత భాగ స్వామ్యంలోని ఒడిదుడుకులు ఒకరినొకరు అర్థం చేసుకుని సర్దుబాటు చేసుకుంటానికి తగిన సమయం దొరుకుతుంది. అంతేకాక గర్భవతిగా, బాలింతగా పాలిచ్చు తల్లిగా క్రొత్తలోనే తగినంత సమయాన్ని భర్త సాంగత్యంలో వినియోగించలేదు. అందుకు భర్త అసంతృప్తి చెందడం గమనించవచ్చు. ఉన్నత, మరియు మధ్య తరగతి కుటుంబాలలో మొదటి రెండు సార్లు గర్భవతిగా ఉన్నపుడు అత్తవారింటినుంచి పుట్టింటికి తీసుకెళ్ళడం ఆనవాయితీ. పెళ్ళయిన వెంటనే గర్భవతి అయినట్లయితే బాలింతగా, బిడ్డతల్లిగా 6 నుండి 9 నెలలు ఒక్కోసారి పుట్టింటిలో ఉంచడంలో స్త్రీకి ప్రత్యేక శ్రద్ధ ఆహార విషయంలోను మానసిక సమర్థన లభించినా దంపతుల మధ్య ఎడబాటు, అందువలన సదవగాహన లోపించడం కద్దు. అందుకని వివాహం కాగానే వెంటనే గర్భవతిగా కుండా చూచుకోవడం ఎంతయినా అవసరం.

వివాహానంతరమే గాక బిడ్డల పుట్టుకల మధ్య 3 లేక 5 సం॥లు వ్యవధి పాటించడం ఎంతో అవసరం. ఎందుకంటే గర్భవతిగా, బాలింతగా బిడ్డ తల్లిగా శారీరక, మానసిక వత్తిడులతోపాటు పోషకాహారపు అవసరాలు పెరుగుతాయి. వెంట వెంటనే బిడ్డపుడితే ఆరోగ్యాన్ని పుంజుకోలేక పోవటమే గాక, శారీరక బలహీనత పెరగటం మానసిక మాంద్యం లేక ఉగ్రత, పోషకాహారం లోపంవల్ల వచ్చే వ్యాధులు తీవ్రస్థాయిలో ఉండి బాధలు పడడం, రోగనిరోధక శక్తి తగ్గి బాలింత రోగాలు, మరియే యితర వ్యాధులకు గురి అవడం గమనిస్తాం.

అదే విధంగా ఎక్కువమంది పిల్లలైనా ఈ యిబ్బందులకు స్త్రీ గురి అవుతారు. ప్రతి కాన్పుకు తల్లికి మరో జన్మలాటిదే. సరియైన నిపుణుల పర్యవేక్షణ అన్ని స్థితులలోను ఉంటేతప్ప ముఖ్యంగా వైద్యుల సలహా మేరకు ఏ తల్లికి నాల్గు కాన్పుల తరువాత అసలు కాన్పులు తప్పనిసరిగా నిరోధించుకోవాలి.

స్త్రీ ఆరోగ్యం గానే ఉంటేనే తను వివిధరంగాలలో నిర్వహించ వలసిన పాత్రలలో, భార్యగా, గృహిణిగా తల్లిగానేకాక, అర్థికరంగంలోకుటుం బానికి సహాయ కారిణిగా కూడ సంపాదించి పెడుతుంది.

పురుషునితో పోల్చి చూచినట్లయితే పని స్త్రీయొక్క గంటలు చాల ఎక్కువ. అంటే 16 గం॥లు అని అంచనా. అంటే సుమారుగా రెట్టింపు అని. దీనితో పాటుగా జీవనక్రియల దృష్ట్యా గర్భవతిగా, బాలింతగు వచ్చే యిబ్బందులను కుటుంబంలోని బాధ్యతలవల్ల కూడ ఆమకు రాజకీయ పరంగా సమానత లేక అన్నిరంగాలలో తమ పాత్రకు న్యాయం చేయలేకున్నది. జీవన క్రియలవల్ల ఆమెకు బాలింత మరణాలు, బాలింత వ్యాధులు, జీవిత పరిమాణం తగ్గటం జరుగుతుంది.

ఆహారపుటలవాట్లను చూచుకొంటే స్త్రీ కొంతవరకు సింహ న్యాయాన్ని పాటించుట కుటుంబాలలో గమనిస్తాం. ముందుగా భర్తకు, పిల్ల లకు పెట్టి తరువాతనే తన పోషక అవసరాలను తీర్చుకుంటుంది. కనుక మామూలుగా ప్రత్యేక స్థితులలో ఉన్నప్పుడు ఆమె కవసరమైన పోషణ విలువ గల ఆహారం లభించదు.

ప్రత్యేక స్థితులైన గర్భవతులుగా, బాలింతగా, బిడ్డ తల్లిగా నిపుణులైన వైద్య, ఆరోగ్య సిబ్బందులచే సలహాలు, సేవలు పొందుతూ ఆరోగ్య పరిరక్షణ చేసికోవాలి. అంతేకాక వ్యాధి నిరోధక శక్తిని పెంచ డానికి ముఖ్యంగా ధనుర్వాత నిరోధానికి గర్భవతిగా నున్నపుడు మొదటి సారిగా రెండు మోతాదులు తరువాతి గర్భంలో ఒక మోతాదు ఈ టీకా సూదులను తీసుకుంటే ప్రసూతి తర్వాత ధనుర్వాతం నుండి రక్షణ కలుగు తుంది.

గర్భవతులలో 100లో 80 మందికి రక్త హీనత ఉంటుందని పరీక్షల వల్ల తేలింది. కనుక రక్తహీనత నివారణకై ప్రతి గర్భవతికి ఐరన్ ఫోలిక్ యాసిడ్ మాత్రలు, రోజు కొకటి చొప్పున 90 తినాలి. అట్లయితే రక్తహీనత నివారణ ప్రసవములో ప్రసవ్యాంతరము జరిగే రక్తస్రావము నివారించ డము, రోగనిరోధకశక్తి పెరగటానికి ఉపయోగపడుతుంది.

వీటన్నిటి దృష్ట్యా స్త్రీకి పాఠశాల విద్యతో పాటు ప్రత్యేకంగా ఆరోగ్య విద్య, తెలిగిన విద్య కూడ అవసరం. స్త్రీకి వ్యక్తి సంక్షేమము, సమాజ సంక్షేమము దృష్ట్యా, దేశ సంక్షేమము దృష్ట్యా విద్యావకాశాలు మెరుగు పరచుట అత్యంతావశ్యకము.

ఆర్థిక పరిస్థితుల దృష్ట్యానే కాక, ఆరోగ్య పరిస్థితుల దృష్ట్యా కూడా కుటుంబాలలో సుఖ సంతోషాలకు యిద్దరే పిల్లలు మేలు.

మారుతున్న, మారిన విలువల దృష్ట్యా ఇద్దరు బాలురైనా, బాలికలైనా ఒక్కటే.

కనుక ప్రతి తల్లి ఆరోగ్యం పరిరక్షించినట్లయితే 2000 సం॥ము నాటికి "అందరికీ ఆరోగ్యం" అనే లక్ష్య సిద్ధి ప్రథమ సోపానం కాగలదు.

ఆరోగ్యవంతమైన జాతి పురోగమనాన్ని పెంచడానికి తల్లుల ఆరోగ్య పరిరక్షణ అవసరమని తెలుసుకున్నాం.

ఆమె నిర్వహించ వలసిన కుటుంబ బాధ్యతలలో వ్యక్తిగా సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ రంగాలలో ఉన్న సమాన అవకాశాలను వీలైనంత వరకు వినియోగించి జాతి శ్రేయస్సుకై తోడ్పడాలంటే స్త్రీ విద్యకు ప్రత్యేకంగా ఆరోగ్య విద్యను పెంపొందించడంలో పాఠశాలలు మహిళా మండలులు, స్వచ్ఛంద సేవా సంస్థలు, వయోజన విద్యాసంస్థలు, యువజన సేవా సంస్థలు ఆరోగ్యసంస్థలు సమగ్రంగా కర్తవ్యనిష్ఠతో పనిచేసి స్త్రీ ఆరోగ్య పరిరక్షణకు తోడ్పడాలి.

ముందు అనుకొన్నట్లుగా సమాజ నిర్మాణంలో నిర్వహిస్తున్న వివిధ పాత్రల దృష్ట్యా స్త్రీ వ్యక్తి కాదు. ఒక సంస్థ వంటిది. అట్టి సంస్థను పరిరక్షించుకోవడానికి ప్రభుత్వము, స్వచ్ఛంద సేవాసంస్థలు నిర్వహించే వివిధ ఆరోగ్య పథకాలు, సేవలు మరియు చిన్న కుటుంబాల ఆవశ్యకతలను ప్రోత్సహించాల్సి ఉంటుంది. అవే జాతి ప్రగతికి ప్రథమ సోపానాలు.

# శిశు సంరక్షణం : తల్లి బాధ్యత

## జె. కె. శకుంతల

మనదేశములో శిశు జనాభా (0-15 సం॥) 43% మానవ శిశువు, యితర జంతువుల పిల్లలవలె కాక చాల కాలము అన్ని అవసరములకు తల్లి తండ్రులపై ఆధారపడి వుంటుంది, శిశువు పుట్టిన దగ్గరనుండి 15 సం॥ వరకు పెరుగు దశలో వుండటం వల్ల అనిగ రకాలైన ప్రమాదాలకు, వ్యాధులకు గురి కావటానికి అనేక అవకాశాలు కలవు. "నేటి బాలులే రేపటి పౌరులు" అన్న విషయం అందరికి తెలిసినదే. అందువల్ల శిశు సంరక్షణ యందు తల్లి తండ్రులు, యితరులు వహించవలసిన బాధ్యత ఎంతో ముఖ్యమైనది.

### గర్భిణి స్త్రీల సంరక్షణ

శిశు సంరక్షణ, పిండము తల్లి కడుపున పడిననాటి నుండే మొదలవు తుంది. గర్భిణీ స్త్రీల సంరక్షణలో ఒక ముఖ్య లక్ష్యమేమిటంటే ప్రతి గర్భిణీ స్త్రీ తొమ్మిది మాసాల తరువాత ఆరోగ్యవంతమైన శిశువును సురక్షితముగా ప్రసవించుట. ఈ లక్ష్యము సాధించుటకు గర్భిణీ స్త్రీల సంరక్షణ చాలా అవసరము గర్భము దాల్చుట సహజమైనా, గర్భమువల్ల తల్లి శరీరములో ఎన్నో మార్పులు వస్తాయి. పైగా గర్భంలోవున్న పిండము పెరిగి పెద్దదయి శిశువు రూపమున బయటికి వెలువడును. పిండము పెరుగుటకు అవసరమైన పోషక పదార్థములన్నిటిని తల్లి శరీరము నుండి పొందును. కాన తల్లికి ఆహార లోపమయినను, ఏవైనా వ్యాధులచే పీడింపబడుతున్నా శిశువుకు హాని కలగ టానికి చాలా అవకాశాలు వున్నాయి. అందువల్ల ఆరోగ్యవంతమైన శిశువును పొందటానికి గర్భిణీ స్త్రీలు తప్పక వైద్య సలహా పొందటం శ్రేయస్కరం.

### శిశు జననాంతరము తీసుకోవలసిన జాగ్రత్తలు

మాతా శిశు సంరక్షణ కోరువారెవరైనా ప్రసవములో శిక్షణ పొందిన వారి వద్దనే చేయించుకోవాలి. ప్రసవము సవ్యముగా జరిగిన శిశువుకు ఏ

హాని కలుగను. అట్లు కాని యెడల శిశువు మరణించుటయో లేదా తల్లికి అపాయము, వచ్చుటో మాతా శిశువులకు వ్యాధులు సంభవించుటో కలుగును. మన దేశములో శిశు మరణముల సంఖ్య మరీ ఎక్కువగా వున్నాయి శిశు మరణాలు ముఖ్యముగా పుట్టిన 7 రోజులలోను తర్వాత ఒక నెలలోను ఆ పైన ఒక సంవత్సరములోను ఎక్కువగా సంభవిస్తూ వుంటాయి. ఈ మరణాలకు ముఖ్య కారణాలు, (1) తల్లికి పోషక ఆహార లోపము అందువల్ల సంభవించు వ్యాధులు ఇష్టంలేని గర్భధారణ పై కారణాలవల్ల మరణము లేదా అవిటి తనము అస్వస్థత శిశువులకు సంభవించవచ్చు.

## బిడ్డ పెరుదల

ప్రతి తల్లి బిడ్డ పెరుగుదలను గమనించవలసిన బాధ్యత వున్నది. బిడ్డ పెరుగుదల మూడు విధాలుగా గమనించవచ్చు.

*(1) శారీరక పెరుగుదల :* పొడవు, బరువు, ఛాతి, తల కొలతలను బట్టి శారీరక పెరుగుదల గుర్తించవచ్చును. శిశువు వయస్సునుబట్టి ఎంత బరువు వుండవలెనన్న విషయమూ, బరువు, ఎక్కువగా వున్నా, తక్కువగా వున్నా, కలుగు నష్టం గురించి ప్రతి తల్లి తెలుసుకొని బిడ్డను పెంచటం చాలా ముఖ్యమైన విషయం.

## శిశువు బరువు పట్టిక

| | | | |
|---|---|---|---|
| 1. | పుట్టినప్పుడు | — | 2 8 కిలోలు |
| 2. | (3) మూడు నెలలకు | — | 4 3 కిలోలు |
| 3. | 6 నెలలకు | — | 5.6 కిలోలు |
| 4. | 9 నెలలకు | — | 7.5 కిలోలు |
| 5. | 1 సంవత్సరమునకు | — | 8.4 కిలోలు |
| 6. | 2 సంవత్సరములకు | — | 10.6 కిలోలు |
| 7. | 3 సంవత్సరములకు | — | 12 కిలోలు |

## మానసిక పెరుగుదల :

ప్రతి ఆరోగ్యవంతమైన శిశువు మానసిక పెరుగుదల వల్ల బిడ్డ ప్రవర్తనలో మార్పులు కనబడుతూ వుంటాయి.

## శిశువులో కనబడు మార్పులు

| వయసు | | మార్పులు |
|---|---|---|
| 1. 2 నెలలకు | — | తనలో తానే నవ్వుకొనుట, నోటిలో ఏదో చప్పుడు చేయుట. |
| 2. 3 నెలలో | — | బోర్ల పడుట, తల పైకెత్తుట. |
| 3. 4 నెలలో | — | నవ్వుట, గుండ్రముగా జరుగుటకు ప్రయత్నించుట. |
| 4. 5 నెలలో | — | దోగాడుట. |
| 5. 6 నెలలో | — | ఏడ్పించిన ఏడుట |
| 6. 7 నెలలో | — | పండ్లు రావటం, కూర్చోనుట. |
| 7. 9 నెలలో | — | ఇతరులను తన వారిని గుర్తించుట, ఆధారముతో నిలబడుట. |
| 8. 10 నెలలో | — | రెండక్షరముల పదములు పలుకుట |
| 9. 1 సంవత్సరము | — | నడచుట, పిలిచిన పలుకుట, తన కిష్టమయినది తినుట. |
| 10. 1- 1½ సం॥ | — | ఇతరులను చూసి వారెల చేస్తే అలా చేయుట కొన్ని పదములు స్పష్టముగా పలుకుట. |
| 2 సం॥ | — | కన్ను ముక్కు నోరు చూపించును. అన్నిటికి ఎదురు చెప్పును. తనకు తానే తినుటకు యిష్టపడును. |
| 3 సం॥ | — | పడకలో మూత్రవిసర్జన మాని వేయును. యితర పిల్లలతో నవ్వుతూ ఆడుకొనును. తనకు తానే సింగా రించుకొనును. |
| 4 సం॥ | — | ఒకటి, రెండు, మూడు చెప్ప గలుగును. |
| 5 సం॥ | — | చెప్పిన వాక్యములను తిరిగి చెప్ప గలుగును. చీకటి అన్నా దయ్యా లన్నా భయం ఇల్లంటే ఆనందం. |

ప్రతి తల్లి జాగ్రత్తగా పైన తెలిపిన మార్పులు బిడ్డ పెరుగుదలలో గమనించి ఏ మాత్రం లోపించి వున్నా వెంటనే వైద్య సలహా పొందటం మంచిది.

## సాంఘిక పెరుగుదల (సాంఘికీకరణము)

బిడ్డను సంఘమున కనువుగా నడచుకొనునట్లు తీర్చి దిద్దటమే సాంఘీకరణ మంటారు తల్లిదండ్రులు ఈ విషయములలో ముఖ్యంగా బాల్యదశలో తగు జాగ్రత్త తీసుకొనటం చాలా అవసరం. ముఖ్యముగా మలమూత్ర విసర్జన శిక్షణ మరియు భాష లేదా మాట్లాడుట నేర్పించవలెను. ఈ వయస్సులో సాంఘికీ కరణములో శ్రద్ధ వహించకపోయిన బాల నేర మనస్తత్వమునకు దారి తీయును.

బిడ్డ తల్లి తనను జాగ్రత్తగాచూసి తన పిలుపుకు సమాధానమిచ్చి తగిన ఆహారము, రక్షణను కల్పిస్తుందని గ్రహిస్తారు. కొంతమంది తల్లులు చంచల మనస్కులై ఏ సమయానికి ఎలా మారుతారో చెప్పలేము. ఇటువంటి తల్లుల ప్రవర్తనా ప్రభావము పిల్లల వికాసం మీద ఎంతైనా ఉంటుంది. ఇంటిలోనే పిల్లవాడు మొట్టమొదట ప్రేమను అనుభవిస్తాడు. కుటుంబంలో ఇచ్చి పుచ్చుకొనే అభిలాషను యింటిలోనే పెంచుకొంటాడు. తన అక్క, చెల్లెళ్ళతో, అన్నదమ్ములతో కలిసి బ్రతకడం కూడా నేర్చుకొంటాడు. కుటుంబసభ్యులతో కలిసిమెలిసి వుండటం నేర్చుకోకపోతే స్నేహితులతో కలిసిమెలిసి తిరగటం కష్టమవుతుంది. ఇతరులలో జాగ్రత్తగా మెలిగితే బాధ్యతను నిర్వహించడం అలవరచుకోడానికి అవకాశాలు ఏర్పడతాయి. సాంఘికమైన అలవాట్లు ఒక తరంనుంచి మరొకతరానికి కుటుంబము ద్వారా సంక్రమిస్తాయి. పిల్లలు మొట్టమొదట కుటుంబముతో తల్లిదండ్రుల సాంఘిక విలువలను అంతః కరణము చేసుకొంటారు. కనుక తల్లి విద్యాజ్ఞానాలు కలదై వుండాలి.

## శిశు ఆరోగ్యం పెంపొందించే విధానాలు

శిశు ఆరోగ్యము పెంపొందించుటకు ప్రతి తల్లి తనబిడ్డ ఆహారము, పరిశుభ్రత, దుస్తులు, వ్యాయామము, నిద్ర (విశ్రాంతి), వ్యాధినిరోధక టీకాలు మొదలగు విషయముల పట్ల శ్రద్ధ వహించవలెను. అపాయములనుండి కాపాడుట, అస్వస్థత కలిగినప్పుడు నిర్లక్ష్యము చేయక వెంటనే తల్లి చికిత్సచేయించవలెను.

**ఆహారము :-** శిశువు పుట్టిన రోజునుండి తల్లిపాలు యివ్వవలెను. మొట్ట మొదటగా వచ్చిన తల్లిపాలు నావామంచిది. ఇందులో తల్లి శరీరములోని వ్యాధినిరోధక శక్తి ఇంకో శిశువును వ్యాధులనుండి కాపాడు విటమినులు మరియు యితర పోషక పదార్థములు ఎక్కువగా వుండును. కాని వాడుకలో ఆపాలు పిల్లలకు అరగదని త్రాగించరు. ఈ నమ్మకము సరియైనదికాదు. తల్లికి పాలుపడిన దగ్గరనుండి, మూడు గంటలకొకసారి పాలుత్రాగటం శిశువుకు అలవాటు చేయవలెను. మధ్యమధ్య కాచి చల్లార్చిన నీళ్ళు మరియు పండ్ల రసము త్రాగించవచ్చును.

శిశువుకు సాధారణముగా తల్లిపాలు 4-6 నెలలవరకే సరిపోవును అందుచేత 6 నెలల లోపుగా పిల్లలకు అన్నప్రాశన చేయుట మంచిది. తల్లిపాలతో పాటు మొట్టమొదటగా మెత్తగా వుడికిన అన్నము లేదా ఏదైనా పిండి పదార్థము గంజి రూపములో (Semi Solid) పెట్టవలెను. అటు పిమ్మట 5 లేక 6వ నెలలో పప్పు కూరగాయలు మెత్తగా వుడికించి, ముద్దగా చేసి మెత్తటి అన్నముతో సహా పెట్టవలెను 7, 8 నెలలలో కోడి గ్రుడ్డు వుడికించి సొన్న భాగమును మాత్రము పెట్టవచ్చును. బిడ్డ 1 సంవత్సరము వయస్సు వచ్చు వరకు యింటిలో అందరూ తినే ఆహారమును భుజింపవలెను.

## తల్లిపాలు మాన్పించుట

తల్లిపాలు ఎంతకాలము శిశువుకు త్రాగించగలిగితే అంతమంచిది. తల్లి పాలు మాన్పించటంతో బిడ్డ తల్లిప్రేమనుండి దూరమయినట్టుగా భావించరాదు భావించిన, బిడ్డ ప్రవర్తనయందు మార్పులు అగుపించును. కాన తల్లిపాలు మాన్పించటం అనునది క్రమేణ జరుగవలెను. పగటిపూట యితర ఆహార పదార్థములు యిస్తూ బిడ్డఆకలి కొనకుండా చూసుకొనిన తల్లిపాలివ్వటం మానేయవచ్చును. అటుపిమ్మట క్రమేణ రాత్రులలోను మానివేయవచ్చును. ఈవిధముగా తల్లిపాలకు బదులుగా యితర ఆహార పదార్థములు బిడ్డ తినటం నేర్చుకొన్నప్పుడు ఒక సంవత్సరము వయస్సు వచ్చునప్పటికి బిడ్డ సంతృప్తితో తల్లిపాలు మానివేయవలెను.

## వ్యాధి నిరోధక టీకాలు

ఆంగ్లములో "Prevention is better than cure" అనగా వ్యాధి రాకమునుపే వాటిని అరికట్టుట నయమని అన్నారు శాస్త్రజ్ఞులు. శిశు మరణ

ముల సంఖ్య తగ్గించుటకుగాను కేంద్ర మరియు రాష్ట్ర ఆరోగ్య సంస్థలు వ్యాధి నిరోధక టీకాల కార్యక్రమమును ముమ్మరంగా చేపట్టినారు. ప్రతి తల్లి తన సంతానాన్ని అంటు వ్యాధుల నుండి కాపాడుకొనుటకు సరియైన వయస్సులో సరియైన మోతాదులో వ్యాధి నిరోధక టీకాలు యిప్పించటం కనీస ధర్మమే కాక అది ఆమె ముఖ్య బాధ్యత. చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకొన్నట్లుగా వ్యాధులకు బిడ్డలు గురియై మరణము, వికలత్వమునకు గురియైన తరువాత చింతించి లాభము లేదు. కాని ప్రతి తల్లి, తండ్రి తమ సంతానానికి ఏ వయస్సులో ఏ టీకాలు యిప్పించవలెనో తప్పక తెలుసుకొనవలెను.

ప్రపంచ ఆరోగ్య సంస్థ (W.H.O.) తెలిపిన వ్యాధి నిరోధక టీకాల పట్టికను ప్రతి తల్లి తండ్రికి ఆరోగ్య కార్యకర్తలు తెలుపుదురు. ఈ పట్టిక ప్రకారము వ్యాధి నిరోధక టీకాలు ఉచితముగా ప్రజలకు ఆరోగ్య సంస్థలు అందజేయును.

## వ్యాధి నిరోధక టీకాల పట్టిక

| వయస్సు | టీకా పేరు | మోతాదు |
|---|---|---|
| 3-9 నెలలలో | 1. బి.సి.జి. టీకాలు | మొదటి మోతాదు |
| | 2. డి.పి.టి. సూది | మూడు మోతాదులు |
| | 3. పోలియో చుక్కలు | 1 లేక 2 నెలలకొకసారి |
| | (శిశు పక్షవాతము) | ,, |
| 9-12 నెలలో | 1. కట్టు టీకాలు | ఒక మోతాదు |
| 18-24 ,, | 1. డి.పి.టి (బూస్టరు) | ఒక మోతాదు |
| 5-6 సంవత్సరములకు | 1. టి.టి. (Booster) | ఒక మోతాదు |
| | 2. టైఫాయిడ్ | |
| 10 సం॥లకు | 1. ధనుర్వాతపు సూది (Booster) | |
| | 2. టైఫాయిడ్ (Booster) | ,, |
| 16 సం॥లకు | 1. ధనుర్వాతపు సూది (Booster) | ,, |
| | 2. టైఫాయిడ్ (Booster) | ,, |

గర్భములోవున్న శిశువును తెల్లని ధనుర్వాతము నుండి రక్షించుటకు క్రింద తెలుపబడునట్లు ధనుర్వాంపు సూదులివ్వవలెను.

| | | |
|---|---|---|
| 20-24 వారములు (5 లేక 6 నెలలలో) | — | మొదటి మోతాదు |
| 36-38 వారములు (9వ నెలలో) | — | రెండవ మోతాదు |

మాతృమూర్తి అయిన ప్రతిస్త్రీ తన సంతానాన్ని భావి భారత పౌరులుగా తీర్చి దిద్ది దేశ సంక్షేమము చేకూర్చి తన కుటుంబ సంక్షేమమును కాపాడుకొని కలకాలము సుఖ సంతోషాలతో వుండడానికి బాధ్యత వహించి కృషి చేయవలెను.

# గర్భధారణ - గర్భ నిరోధక పద్ధతులు

డా॥ ఇ. రాజ్యలక్ష్మి

ప్రపంచములో భారతదేశ జనభా రెండవ స్థానము ఆక్రమిస్తున్నది. భారత దేశములో జనన మరణాల నమోదు యింకను సంపూర్ణముగా లేదు. అందువల్ల ప్రస్తుత జనాభా పెరుగుదల రెండు శాతం వున్నట్లు అంచనా.

జనన వుత్పత్తిని అదుపులో వుంచటం అన్నిటికన్నా ముఖ్యమైన అంశముగా ప్రపంచంలోని వైద్యులందరు భావిస్తున్నారు. భారత దేశాన్ని ప్రమాదానికి గురి చేస్తున్న జనాభా పెరుగుదల సమస్యను ఎదుర్కొవటానికి కుటుంబ సంక్షేమ కార్యక్రమాన్నే అమలు జరుపుచున్న మన ప్రభుత్వాలకు మన మందరం కలిసి కట్టుగా సహకరించాలి. అంటే ప్రజలందరు హృదయ పూర్వకముగా ఈ కార్యక్రమాన్ని కొనసాగుటకు చేయూతనివ్వాలి.

ఎందుకు ? అంటే ప్రస్తుతం మన పరిసర పరిశుభ్రత మెరుగు పడింది. వివిధ జబ్బులను అరికట్టే చర్యలు తీసుకుంటున్నారు. పోషకాహారం సమకూరుతూంది. వైద్య సదుపాయాలు వాడవాడలకు విస్తరించాయి. వీటన్నిటితో మరణాల రేటు తగ్గింది. మశూచి, కలరా, టైఫాయిడ్, మలేరియా మొదలగు వ్యాధులను అరికట్ట గలిగారు. దీనివల్ల జీవిత ప్రమాణము 50 సం॥లకు పైగా పెరిగింది. అంటే మరణాలను చాల వరకు అరికట్ట గలిగాము. అందువల్ల జనభా విపరీతముగా పెరిగించనే విషయము గుర్తుంచుకోవాలి. అంటే జనాభా 1991 నాటికి 80 కోట్లు ఈ శతాబ్దం ఆఖరుకు 90 కోట్లు వుంటుందని అంచనా : ఇప్పటి జనాభాలో 50 శాతం దాకా 14 సం॥ నుండి 19 సం॥ వయస్సులోని వారు. అందువల్ల జనాభా పెరుగుదల దీని మూలంగా మన ఆర్థిక అభివృద్ధికి పెద్ద అడ్డంకి ఏర్పడుతున్నది. జనాభా పెరుగుదలను అరికట్టక పోతే ప్రజల జీవన ప్రమాణము మెరుగుపడే ఆశలు లేవు. భర్తీ చేసేందుకు వీలులేని ప్రకృతి సిద్ధ సాధన సంపత్తులు వనరులు నిరనధికంగా తగ్గిపోతున్నాయనే అంశాన్ని కూడా గుర్తుంచుకోవాలి.

అయితే ఇది ఎలా సాధ్యము, అంటే జననాల రేటును నిరోధించటం ఒక్కటే అత్యంత ఆశాదాయకమైన పద్ధతి. జననాల రేటును నిరోధించటానికి వివిధ గర్భ నిరోధక విధానాలు స్వీకరించబడ్డాయి. పరి పూర్ణమయిన గర్భ నిరోధక విధానము నూటికి నూరు పాళ్ళు సమర్థవంతముగా వుండాలి; సులభముగా మార్చడానికి అనువైనదిగా ఉండాలి. మానసికంగా ఎటువంటి అనుమానాలు లేకుండా అంగీకరించడానికి వీలుగా వుండాలి, వైద్యరీత్యా సురక్షితమైనదిగా ఉండాలి.

అమలులోవున్న గర్భ నిరోధక పద్ధతులు ఈ పై అంశాలకు సరి పోయినవి. అందువల్ల ప్రభుత్వం వీటిని అమలు పరిచింది. వీటిలో ఒకటి తాత్కాలిక పద్ధతులు రెండవది శాశ్విత పద్ధతులు.

1. సహజమైన లేక జీవన సంబధమైన పద్ధతులు.

2. యాంత్రిక పద్ధతులు.

3. రసాయనిక పద్ధతులు.

4. క్రమబద్ధమైన గర్భ నిరోధక మాత్రలు.

5. గర్భాశయంలో నుంచే సాధనము (Copper T. విధానము)

6. శస్త్ర సంబంధమైన పద్ధతులు శాశ్వత పద్ధతులు.

7. వివాహ వయో పరిమితిని పెంచుట.

8. ప్రేరేపించబడ్డ గర్భస్రావాలు కూడ గర్భనిరోధమునకు పరోక్షముగా దోహదం కలిగిస్తాయి. కాని యిది శాశ్వతమైన పద్ధతి కాదు. వేసెక్టమీ ట్యూబెక్టమీలు శస్త్ర చికిత్స పద్ధతులు శాశ్వతమైనవి. ఇండ్యూస్డ్ అబార్షన్ కుటుంబ నియంత్రణ పద్ధతిగా పరిగణింగబడుట లేదు.

**సహజమైన పద్ధతులు :** ఇది ఇంద్రియ నిగ్రహానికి సంబంధించిన పద్ధతులు. దీనిలో మొదటివి భార్య, భర్త చాలాకాలముపాటు సంసారిక జీవితములో పాల్గొనక పోవటం. ఇది ఆచరణాత్మకమైనది కాదు. దంపతులకు ఆనందదాయకం అంతకన్నా కాదు.

రిథమ్ పద్ధతి (అండోత్పత్తి జరిగే సమయంలో సంభోగాన్ని నివారించి టానికి నిగ్రహాన్ని పాటించడం) ఇది సంతాన నిరోధానికి వెనుకటి నుండి అనుస రిస్తున్న పద్ధతి. అండోత్పత్తి ద్వారా సంతానోత్పత్తి జరుగుతుందన్న శాస్త్రీయ అవగాహన ప్రాతిపదికగా అనుసరిస్తున్న పద్ధతి యిది. అండోత్పత్తిని గురించి దీనికి బహిష్టుకు ఉన్న సంబంధాన్ని గురించి ఈ శతాబ్దిలోనే తెలిసింది. రిథమ్ పద్ధతి అంతగా ఫలించేది కాదు. అయితే ఇందువల్ల దాని ప్రాధాన్యత తగ్గదు. సురక్షిత కాలంలో సంభోగ కార్యక్రమం జరపడంనే రిథమ్ పద్ధతి అంటారు. దంపతుల నిగ్రహశక్తి మీద క్రమబద్ధమైన బహిష్టు మీద దీని విజయం ఆధారపడి వుంటుంది. విద్యాధికులైన దంపతులలో ఈ పద్ధతి ఎక్కువగా విజయవంతమవుతుంది.

*సంభోగ విరమణ* : ఇది కూడా సహజ పద్ధతే అయితే గర్భధారణను నిరోధించడానికి అనుసరించే పాత పద్ధతే యిది. ఈ పద్ధతి ప్రపంచమంతట వాడుకలో వున్న పద్ధతి. స్ఖలనానికి ముందే పురుషుడు సంభోగము నుంచి విరమించుకునే ఈ పద్ధతి ఎన్నో సమాజాలలో ప్రాధాన్యత వహించింది. భర్త నిర్ణయంపై ఈ పద్ధతి ఆధారపడి వుంటుంది. కొంత మంది దంపతులకు ఈ పద్ధతి అనువు కాదు.

## యాంత్రిక పద్ధతులు :

యాంత్రిక పద్ధతులలో పురుషులకు కండోమ్ స్త్రీలకు డయాఫ్రం రబ్బర్ లేక లాటెక్స్‌తో తయారు చేయబడినవి. కండోమ్ పురుషులు ఉపయోగించే సాధనము. కండోమ్ సాధనము ద్వారా పురుషుని వీర్య కణాలు అండము చేరకుండా నిలిపి వేయడం జరుగుతుంది. పురుషాంగానికి కండోమ్‌ను జాగ్రత్తగా గాలి లేకుండ తొడగాలి. గాలి వెళితే కండోమ్ చినిగి పోవు ప్రమాదం వుంటుంది. గాలిలోనికి వెళితే కండోమ్ నుంచి వీర్యం బయటికి వచ్చే ప్రమాదం గూడ వుంటుంది. సంభోగ విరమణ సమయంలో గూడ కండోమ్ పై భాగాన్ని భద్రంగా పట్టుకొని బయటికి తీయాలి. ఒక కండోమ్‌ను ఒక్కసారి మాత్రమే ఉపయోగించాలి. ఈ కండోమ్‌ల కాలపరిమితి చూచు కొని వాడాలి. (Expiry date). ఇవి ప్రతివారికి అందుబాటులోనే ప్రభుత్వం

వుంచారు. చాల తక్కువ ధరకు దొరుకుతాయి కూడా. వీటినే నిరోధ్‌లంటారు. ఈ నిరోధులు చాల దంపతుల వాడకంలో వున్నాయి.

*డయాఫ్రమ్* : డయాఫ్రం ద్వారా స్త్రీ వీర్యకణాల నుంచి రక్షణ పొందును. ఇది ఇప్పటికి కొందరు స్త్రీలు ఉపయోగించుచున్నారు. అయితే ప్రస్తుతం ఈ పద్ధతికి వున్న కొన్ని సాధక, బాధకములవల్ల అంతగా వాడటం లేదు. దీనిని వైద్య సహాయముతో పొంచవచ్చును. వైద్యులు ఇవి ఉపయోగించే స్త్రీలకు తగినంత శిక్షణ ఇస్తారు.

## రసాయనిక కణ సంహారులు

ఈ పద్ధతులు ప్రస్తుతం అంత వాడకంలో లేవు. అయినప్పటికి దీనిని తెలుసుకోవచ్చును. ఇది వీర్యకణాలను కదలనీయకుండా వుంచుతుంది. తరువాత సంహరిస్తాయి. ఇది రసాయనిక వస్తువులవల్ల జరుగు ప్రక్రియ కాని దీనికి కాలపరిమితి వుంటుంది. అంతేగాక సంభోగమునకు ముందుగా ఉపయోగించాలి. దీని ప్రభావం ఇరవై నిముషములు మాత్రమే ఉంటుంది. ఈ పద్ధతికి తగు జాగ్రత్త లేకపోతే ఫలితం ఉండదు.

## క్రమబద్ధమైన గర్భనిరోధక మాత్రలు

ఈ క్రమబద్ధమైన గర్భనిరోధక మాత్రలు ఈ రోజు ప్రపంచములో ఎంతో విశ్వసనీయమైనవి. గర్భనిరోధక మాత్రలను కనుగొనడంద్వారా గర్భనిరోధక విధానాలలో విప్లవకరమైన పరిణామాలు వచ్చాయి. బహిష్టు జరిగిన అయిదవ రోజునుండి క్రమము తప్పక ప్రతిదినము ఒక్కటి చొ॥న 25 రోజులు తీసుకోవాలి. ఇవి స్త్రీలో ఉత్పత్తి అయ్యే ఈస్ట్రోజిన్, ప్రొజెష్టెరాన్‌కు అనుగుణమైనది. మిశ్రమమైన మాత్రలు వేరు వేరుగా ఈస్ట్రోజిన్, ప్రొజెష్టెరాన్ ఉండు మాత్రలు కూడ లభ్యమవుతాయి. ఈ మాత్రలు వాడటం ఆపిన వెంటనే సంతానోత్పత్తి మామూలుగా కొనసాగుతుంది. ఈ మాత్రలు ఉచితంగా ప్రభుత్వ ఆసుపత్రులందు లభ్యం అవుతాయి. వీటిని తీసుకునేముందు వైద్య సలహా తీసుకోవటం చాలా ముఖ్యం. నెలకొకసారి లేక మూడు నెలలకు, ఆరు నెలలకు తీసుకునే, మూఢి మందుకూడ ఉన్నది. సంభోగం తరువాత మ్రింగే మాత్రలు లేక గర్భనిరోధానికి సంవత్సరానికి ఒకసారి తీసుకొనే టీకా చాలా అవసరమైనవే. కాని ఇప్పటివరకు ఇంకా ప్రచారంలోకి రాలేదు.

## గర్భాశయ మందుంచు సాధనము

ఈ సాధనము ప్రపంచమంతటా అధిక ప్రచారంలో వున్న ఆధునిక మైన పద్ధతి. దీనివలన అండము పిండముగా మారినను అది గర్భాశయంలో స్థానము ఏర్పరచుకొనక బహిర్గతమగును. గర్భవిచ్ఛిత్తిని మాత్రం ఈ సాధనము కల్గించదు. అందువల్ల గర్భాన్ని ధరించిన స్త్రీలు దీనిని విచ్ఛిత్తి గల్గునేమోనను భావనతో ఈ సాధనంను ఉపయోగించరాదు. ఈ విధానమును ఉపయోగించే స్త్రీలలో సగటున ఋతుస్రావం, ఒకటి రెండు రోజులకన్నా ఎక్కువకాని తక్కువకాని వ్యత్యాసం ఉండదు. గర్భాశయంలో సంతానోత్పత్తిని నివారించే వాతావరణాన్ని ఈ సాధనం కల్పిస్తుంది.

గర్భాశయ సాధనాల (**Intra uterine contraceptive devicer**) చరిత్ర చాల ఆసక్తి కరంగా వుంటుంది. దీర్ఘకాలిక ఎడారి ప్రయాణంలో ఒంటెల గర్భనిరోధానికై అరబ్బులు, తురుష్కులు కొన్ని సంవత్సరాల వరకు చిన్న గుండ్రటి రాళ్ళను ఒంటె గర్భాశయంలో వెయ్యడంద్వారా గర్భధారణను అరికట్టారు. 1928-29 సం॥లో గ్రాఫియన్ బర్గ్ అనే గైనకాలజిష్టు వెండి, బంగారం తీగతో చేసిన రింగులు స్త్రీ గర్భాశయంలోనికి చేర్చినప్పుడు గర్భనిరోధం జరుగుతున్నదని శాస్త్రీయ సమావేశములందు పేర్కొనినప్పుడు ఆయన పరిశోధనను ఎందరో గైనకాలజిష్టులు త్రోసిపుచ్చారు. తదుపరి 1930 నుండి 1959 వరకు ఎందరో అనేక రకములైన గర్భాశయ సాధనములను పరీక్షించినప్పటికి ఈ విధానమును అంగీకరించలేదు. 1959లో జపాన్‌కు చెందిన ఇషియామా, ప్లాస్టిక్‌తో చేసిన సాధనమును స్త్రీ గర్భాశయములో చేర్చినట్లయితే గర్భనివారణ జరుగుతుందని అన్నారు.

భారత దేశంలో (**Lippies Loop**) లిప్పీన్‌లూప్ విధానమును ముందుగా ప్రవేశ పెట్టారు. దీనిని కొన్ని లక్షలమంది అనుసరించారు. ఈ పద్ధతి చాల తక్కువ ఖర్చుతో ప్రభుత్వం అసలు ఉచితంగానే ప్రజల అందుబాటులో వుంచారు. ఇది ఒకసారి అమర్చిన 5-6 సం॥ పైగా ఉంచుకోవచ్చును ఇది అమర్చడానికి కొన్ని నిమిషములు మాత్రం తీసుకుంటుంది. డాక్టర్లు ప్రస్తుతం

**Lady Health Visitors** కూడ మత్తుమందు లేకుండానే ఈ లూపును అమర్చ వచ్చు. ఈ లూపు విధానం వల్ల కొంత మందిలో రక్తస్రావం, నొప్పి ఉండటం వల్లను, దీనికంటే అతి సులువైన మరొక సాధనం పరిశోధించడంవల్ల ప్రస్తుతం ఆ విధానము, వాడుకలోకి వచ్చింది. దీనినే పరుకాలూపు విధానము అంటారు.

ప్రథమంగా ఈ లూపు కొరకు వచ్చిన స్త్రీలకు గర్భాశయ పరీక్ష జరుపబడును. తరువాత ఈ విధానమునకు అనువైన స్త్రీలకు మాత్రము ఋతుస్రావమైన అయిదవ దినమునుండి పది దినములలోపుననే అమర్చబడును. ఇలా పరీక్షింపబడిన స్త్రీలకు ఏవైనా జబ్బులు వున్న వారికి ఉచిత వైద్య సలహా యిచ్చి జబ్బు నయమై అనువైన సమయం వచ్చినప్పుడు ఈ కాపర్ టీ అమరబడుతుంది. లేనియెడల వేరే విధానమును, మార్గముగా తెలుపబడును. దంపతులు తాత్కాలికంగా ఈ విధానమును ఉపయోగించుకొని మరల సంతానము కావాలనుకొనినప్పుడు ఈ సాధనము డాక్టరు ద్వారా తీసివేయించుకోవచ్చును. ఇది మూడు సం॥ వరకు పనిచేయును. ఇది అవలంబించు స్త్రీలకు తొమ్మిది రూపాయలు పారితోషికముగా ప్రభుత్వపరంగా లభించును. ఇంకను ఎన్నో క్రొత్తరకాల గర్భాశయ సాధనాలు ప్రయోగదశలో ఉన్నాయి.

## శస్త్రసంబంధమైన పద్ధతులు

ఈ శస్త్రసంబంధమైన పద్ధతులే శాశ్వత పద్ధతులు. పురుషులకు వేసెక్టమి, స్త్రీలకు ట్యూబెక్టమి అనే శస్త్ర విధానాలు భార్యాభర్తలిద్దరి ఆమోదం అవసరమే కాకుండా ఆనంద దాయకం; సులభతరం కూడాను. వేసెక్టమి అనబడే ఈ శస్త్రచికిత్స చాలా సురక్షితమైనది, అతిసులభమైనది. ఈ ఆపరేషన్‌కు స్థానికంగా (**LOCAL**)మత్తు మందునిచ్చి (శస్త్ర చికిత్స జరిగే చోటు) చర్మం క్రింద, వీర్యకణాలను తీసుకొని వెళ్ళే నాళాలను కట్టివేసే పద్ధతి. పదిహేను ఇరవై నిముషాలలో ఈ చికిత్స పూర్తి అవుతుంది. తిరిగి పిల్లలు కావాలనుకున్నప్పుడు ఈ చికిత్సను మరల శస్త్రపరంగా మార్చడం సాధ్యమైనప్పటికిని అదికొన్నిసార్లు విజయవంతంకాదు. కనుక వేసెక్టమి విషయములో ఇక దానిని మార్చడం సాధ్యంకాదన్న నిర్ణయానికి దంపతులు ముందేరావాలి. శస్త్రచికిత్స జరిగిన వెంటనే ఇంటికి పంపవచ్చు. హాస్పిటల్‌లో వుండవలసిన

అవసరంలేదు. రెండురోజులు పూర్తిగా విశ్రాంతి తీసుకోవాలి. తరువాత అయి దవరోజు కుట్లు విప్పుతారు. వేసెక్టమీ అయిన మూడు నెలల వరకు గర్భ నిరోధక సాధనాలు వాడాలి లేక నిగ్రహం పాటించాలి. వేసక్టమీ ఆపరేషన్ వల్ల నపుంసకత్వం రాదు. తర్వాత ఎటువంటి కొరత లేకుండా సాధారణ మైన సంతృప్తికరమైన వైవాహిక జీవితం గడువవచ్చును. వేసెక్టమి ఆప రేషన్ వల్ల ఆరోగ్యానికి ఎటువంటి ప్రమాదం ఏర్పడదు. నూటికి నూరుపాళ్లు విజయవంతమేనన్న విషయాన్ని గుర్తించుకోవాలి.

## ట్యూబెక్టమి

ఈ శస్త్రచికిత్స వేసెక్టమీ అంత సులువైనది కాదు. అయినప్పటికి చాల సురక్షితమైనది. నమ్మకమైనది. ఈ శస్త్ర చికిత్స కాన్పులోకాని లేదా తరువాత ఎప్పుడైనా చేయించుకోవచ్చు. దీనిని కడుపుగుండా కాని యోని గుండాకాని, అండమును తీసుకొనిపోవు నాళాలను శస్త్రచికిత్సకు గురిచేయ వచ్చును. మత్తుమందు స్థానికం కాని (Local), వెన్నెముకలో (Spinal) కాని సాధారణముగాను (General), సర్జన్ ఇష్టముపైనను అంటే స్త్రీ యొక్క శరీరతత్వంపై జరుగుతుంది ట్యూబెక్టమి జరిగిన తరువాత ఆరు, ఏడు రోజులు హాస్పిటల్లో ఉండి వైద్యసహాయం, విశ్రాంతి పొందాలి. ఈ శస్త్ర చికిత్స అనంతరం కూడ బహిష్టు మామూలుగానే జరుగుతుంది. స్త్రీ యొక్క లైంగిక జీవితం కూడ స్వాభావికంగానే వుంటుంది. ప్రభుత్వ ఆసుపత్రులందు ఈ చికిత్స ఉచితంగానే జరుగుతుంది.

చివరగా వివాహానికి వయోపరిమితిని పెంచిన చట్టం మొట్టమొదలు 1929లో ఆమోదించారు. దీని సవరణను 1978లో తిరిగి జరిగినది. ఇందు మూలంగా బాలికకు 18 సం॥లు, బాలురకు 21 సం॥లు నిండాలి. దీనికి కారణం గర్భస్థ శిశు మరణాలు/జబ్బు పడటము/బాలింత మరణాలు/ జబ్బులరేటు ఇంత ఎక్కువ ఉండటానికి కారణం బాలికలు చిన్న వయస్సు లోనే గర్భం ధరించడం. 20 సం॥ లోపు వయస్సు పిల్లలు మానసికంగాను, శరీరకంగాను తల్లులయ్యే స్థితిలో లేక పోవటమే.

బాల్య వివాహాలను అరికట్టేందుకు వివాహ వయస్సును పెంచారు. ఇది ఉపయోగం. పిల్లలకు మహిళలకు జీవన సదుపాయాలను ఎక్కువ చేసేందుకు,

జీవిత వాస్తవాలను ఎదుర్కొనేట్లు మహిళలను సిద్ధపరిచేందుకు, మహిళలు తల్లులుగా తమ బాధ్యతలను నిర్వర్తించేందుకు వివాహ వయస్సును పెంచ వలసి వచ్చింది. దేశ ప్రయోజనాల దృష్ట్యా జనాభా పెరుగుదలను కొంత వరకు అరికట్టేందుకు వివాహ వయస్సును పెంచటం తప్పనిసరి అయినది.

సాంస్కృతికంగా సామాజికంగా విభిన్న వర్గాలున్న భారతదేశంలో గ్రామీణ, పట్టణ విద్యాధిక, నిరక్షరాస్య, పేద ధనిక ప్రజలను దృష్టిలో ఉంచుకొని అన్ని రకాల గర్భ నిరోధక సాధనాలను ప్రోత్సహించవలసి వుంటుంది. ఈ కృషిలో పౌరులందరు తప్పనిసరిగా సహకరించాలి

# స్త్రీలు : పోషకాహారం

డా॥ పి. భాస్కరం

మనం ప్రస్తుతము ఒక దశాబ్దములో అంటే 1975-85 సంవత్సరాలలో స్త్రీల ప్రగతిని, అన్ని రంగాలతో పాటు ఆమె పోషణస్థితి కూడ ఏ విధంగా వుందో పరిశీలిద్దాం. ఈ దశాబ్దిలోనే గాక గత 4-5 దశాబ్దాలుగా జాతీయ పోషకాహార సంస్థ జరిపిన పరిశోధనల వలన వివిధ వయస్సులలోని స్త్రీల యొక్క పోషకాహార వ్యవస్థ గురించి ఎన్నో విషయాలు తెలిశాయి.

వేదకాలం నుంచి కూడా మన దేశంలో స్త్రీలకి సమాజంలో ఎంతో విలువైన స్థానము ఉంటూ వచ్చింది. కాని మారుతున్న ఆర్థిక వ్యవస్థలు, మారుతున్న జీవన ప్రమాణాలు స్త్రీకి యింట్లోను, సమాజం లోను లభిస్తున్న విలువను కొంత వరకు మరుగు పరుస్తున్నాయి. సాధారణంగా ప్రతి యింటిలోనూ ఆడ శిశువుకు, మగ శిశువుకు మధ్య కనబరిచే వ్యత్యాసం, స్త్రీ వంటింటికి మాత్రం పరిమితమయి సంసారం ఒడుదుడుకులన్నిటిని భరిస్తూ జీవించే వ్యక్తిగా మాత్రమే వుండాలనే భావాలు దీనికి నిదర్శనం. బిడ్డ పుట్టక ముందు నుంచి మగపిల్లవాడా ! ఆడపిల్లా అనే ఆతృత, ఆడ బిడ్డ పుట్టగానే అయ్యో! ఆడపిల్లా అనే నిస్పృహ దీనికి తార్కాణం. శాస్త్ర పరిశోధనల వలన కూడా మన సమాజంలో ఆడపిల్లకు మగపిల్లవానికి లభించినంత ఆదరణ, ప్రాధాన్యం లభించడం లేదని తెలుస్తోంది. బడికి వెళ్ళి చదువుకునే ఆడపిల్లల సంఖ్య నేటికి బడికి వెళ్ళే మగపిల్లల సంఖ్య కంటే తక్కువే. అనారోగ్యం, ముఖ్యంగా పోషకాహార లోపం వలన వచ్చే వ్యాధులు ఆడపిల్లల్లో ఎక్కువగా కనిపిస్తున్నాయి. ఆహారములో శక్తి, మాంసకృత్తులు లోపిస్తే వచ్చే నంజు ఎండు వంటి వ్యాధులు మగపిల్లల్లోకంటే ఆడపిల్లల్లోనే ఎక్కువగా కనిపిస్తున్నాయి. ఇంకా ఎక్కువ మంది ఆడపిల్లలు వారి వయస్సుకు తగ్గ ఎత్తు, బరువు లేక బక్క చిక్కి వుండడం గమనిస్తూనే వుంటాం. బీదరికం ఆహార

లోపం బీద ప్రజలందరిలోనూ ఉన్నప్పటికీ వీటి తీవ్ర పరిణామాలు మాత్రం ఆడపిల్లల్లో కనిపించడం వలన మన సమాజంలో ఆడపిల్లల ఆరోగ్యంపట్ల తల్లిదండ్రులు చూపించే అశ్రద్ధ కారణమని స్పష్టమౌతుంది పురుషుని ఆర్థిక స్వాతంత్ర్యము మన సమాజంలో జీర్ణించుకుపోయిన కొన్ని నమ్మకాలు దీనికి కారణం.

కాని ఆర్థిక పరిస్థితులు, జీవన ప్రమాణాలు ఎంతగా మారినప్పటికి సమాజం లోని ప్రతిపాప, ప్రతి పురుషుడు తన ఉనికికి ఎప్పుడూ స్త్రీ పై ఆధారపడి వున్నాడు. భావి పౌరులైన నేటి పిల్లల ఆరోగ్యానికి, మానసిక వికాసానికి, తద్వారా దేశ పురోగమనానికి స్త్రీ కీలకపాత్ర వహిస్తుందంటే అతిశయోక్తి లేదు. స్త్రీ తన అత్యంత బాధ్యతాయుతమైన ఈ పాత్ర నిర్వహించాలంటే ఆమె మగవారితో సమంగా అన్ని రంగాలలోను పురోగమించాలి. దీనికి విద్య, ఆర్థిక స్వాతంత్ర్యమే కాక ప్రకృతి సిద్ధమైన రాటు పోటులకోర్చే ఆరోగ్య వ్యవస్థ ఆమెకు ఎంతగానో అవసరం.

1975 సంవత్సరం అంతర్జాతీయ మహిళా సంవత్సరంగా ప్రకటించి నప్పటి నుండి స్త్రీ సంక్షేమం, స్త్రీ పురోభివృద్ధికి మన ప్రభుత్వం ఎన్నో పథకాలను రూపొందించింది. వీటి ఫలితంగా స్త్రీ విద్యా వైజ్ఞానిక రంగాలలో తగినంత ప్రగతిని సాధించగలిగింది. కాని అతి ముఖ్యమైన ఆమె ఆరోగ్య స్థితి నాడు, నేడు ఒక మాదిరిగానే వుండిపోయింది

ఆరోగ్యం అంటే రోగాలు రాకుండా వుండడమే కాక, బలంగా వుండడము కూడా. శరీరధారుడ్యానికి పోషకాహారం అవసరం. మన బీద ప్రజలలో, మధ్య తరగతి కుటుంబీకులలో, వెనుకబడిన జాతి ప్రజలలో ఈ పోషకాహార లోపం వాటివలన వచ్చే వ్యాధులు ఎక్కువగా కనిపిస్తున్నాయి. ముఖ్యంగా కని పెంచే వయస్సు (15-49 yrs) స్త్రీలలో ఈ వ్యాధులు ప్రత్యేకంగా కనిపిస్తున్నాయి. ఈ స్త్రీల శరీర బరువు ఉండవలసిన బరువు కంటే చాలా తక్కువగా వుంటుంది. రక్తహీనత, B Complex, 'ఎ' విటమినుల లోపాలు ఎక్కువగా వీరిలో కనిపిస్తాయి. ఈ వయసు స్త్రీల మరణాలకు 25 శాతం వరకు రక్తహీనత కారణమని తెలుస్తోంది.

ఇంత తీవ్రమైన ఆహార లోపాలు స్త్రీలకే ఎందుకు రావాలి అంటె కారణం యిది అని వేలెత్తి చూపించడం కష్టం. సాధారణంగా ఆహార లోపం వలన వచ్చే వ్యాధులకు మూలకారణం బీదరికం. సరైన సరిపోయినంత ఆహారము కొనుగోలు చేసుకొనే శక్తి లేకపోవడమే. అయినప్పటికి ప్రత్యేకంగా స్త్రీలలో ఈ వ్యాధులు ఎక్కువగా కనబడటానికి యితర కారణాలు దోహదం చేస్తాయి

సాధారణంగా ప్రతి యింట్లోను భర్తకి, పిల్లలకి భోజనం పెట్టి వారు తిన్న తరువాత స్త్రీ తినడం చాలా పండి సాంప్రదాయం. ఈ అలవాటు వలన చివరకు మిగిలిన స్త్రీకి, పంటకాలు మిగలక తద్వారా ఆమె ఆహార లోపం వలన వచ్చే వ్యాధులకి గురి యౌవుతుందని అనుకోవడం జరుగుతోంది. కాని శాస్త్ర పరిశోధనల స్పష్టంగా దీని వాదానికి నిదర్శనం లేదు. దేశవ్యాప్తంగా జరి పిన ఆహారపుటలవాట్ల పరిశోధనలలో సదిపయస్సులోన స్త్రీ పురుషులు తీసుకొనే ఆహార ప్రమాణాలలో తేడాలేదని తెలుస్తోంది. ఈవిషయం ప్రతి స్త్రీకి వర్తిం చక పోవచ్చు. కాని యింట్లోవున్న పంటకాలను అందరూ సమానంగా పంచు కుంటారని తెలుస్తోంది. అయితే పోషకాహార లోపం స్త్రీలలో ఎక్కువగా కని పించడానికి యితర కారణాలు వున్నాయన్నమాట.

మేధస్సుల్లోను, పలురంగాల్లోను స్త్రీ పురుషులతో సరిసమానంగాతూగినా, ప్రకృతి సిద్ధంగా స్త్రీ పురుషుల జీవనరీతుల్లో, ఎంతో వ్యత్యాసం వుంది ఋతుస్రావం గర్భధారణ, పాలిచ్చి పిల్లలను పెంచడం స్త్రీకి ప్రకృతి విధిం చిన బాధ్యతలు. ఈ బాధ్యతలను నిర్వర్తించే వయసులో స్త్రీకి ఎక్కువ రక్షణ, అదనపు పోషకాహారం. కనీసపుటవసారాలే తీరని బీదరికపు స్త్రీలకు. ఈ అదనపు అవసరాలు తీరేదెట్లా? దీని పరిణామాలే వివిధరకముల పోష కాహార లోపాలు. దీనికి తోడుగా అనాదిగా వస్తున్న ఆచారాలు, ఆహారపుటల వాట్లు, మూఢనమ్మకాలు ఈ విషమ పరిస్థితి-దోహదంచేస్తున్నాయి.

ఇప్పటికీ పల్లె ప్రాంతాలలో 18 సం॥లోపు బాలికల [illegible] పరిపాటే. ఈ వయస్సులో పిల్లలకి వార్త్రి పెరుగుదలకే అదనపు ఆహారం అవ సరం. ఇకవారు గర్భిణీగా వున్నప్పుడు [illegible] అవసరాలు [illegible] తాయి. శారీరకంగా గాని, మానసికంగా గాని, [illegible] ఈ బాలి కలకు గర్భధారణ ఒక సమస్య. [illegible]

కొన్ని ఆహార పదార్థాలు గర్భిణి స్త్రీలు తినకూడదనే మూఢనమ్మకాలు మన ప్రజల్లో విపరీతంగా వున్నాయి.

మాంసం, పాలు, బొప్పాయి, అరటిపండ్లు, కొన్ని కూరగాయలు గర్భిణీ స్త్రీలు, పాలిచ్చే తల్లులు తినకూడదని మూఢ నమ్మకం. యింకా, గర్భిణీ స్త్రీ ఎక్కువ ఆహారం తీసుకుంటే గర్భస్థ శిశువు పెద్దగా పెరుగుతాడని దానివలన కాన్పు కష్టం అవుతుందని మరో మూఢ నమ్మకం. వీటి ఫలితంగా గర్భిణీ స్త్రీకి అందుబాటులో నున్న ఆహార పదార్థాలను ఎక్కువగా తీసుకునే అవకాశము వుండదు. ఈ ఆహారలోపం వలన సుమారు 50 శాతం గర్భిణీ స్త్రీలలో రక్తహీనత కలుగుతుంది. 30 శాతం స్త్రీలు, నాలుక, నోరు పగుళ్ళతోను, 10-20 శాతం విటమిను A లోపం వలన బాధపడుతారు. యింతేగాక ఈ ఆహార లోప ఫలితాలు గర్భస్థ శిశువు మీద కూడా ప్రభావం చూపిస్తాయి గర్భస్రావం, నెలలు ముందే ప్రసవించడం. బిడ్డ చనిపోయి పుట్టడడం, శిశువు బలహీనంగా తక్కువ బరువుతో పుట్టడం జరుగుతాయి. మన ప్రజలలోని గర్భిణీ స్త్రీల ఆహారం పరిశీలిస్తే వీరు అవసరమైన దాని కంటే ఎంతో తక్కువ ఆహారం తీసుకొంటున్నట్టు తెలుస్తోంది. గింజ ధాన్యాలు, పప్పుదినుసులు, తద్వారా శక్తి జనకాలు, మాంసకృత్తులు వీరికి అవసరమైన దాని కంటే సుమారు సగము మాత్రమే తీసుకొంటున్నారు. యింకా ఆకు కూరలు, పాలు, పండ్లు వీరసలు ప్రత్యేకంగా తీసికోరనే చెప్పవచ్చు.

వీరు తీసుకునే ఆహారపు పోషక విలువలు చూస్తే తేలికగా పనిచేసే గర్భిణీ స్త్రీకి రోజుకి 2200 కేలరీల శక్తి 59 గ్రా మాంసకృత్తులు, 1000 mg కాల్షియం, 40 mg యినుము అవసరం అవుతాయి. కాని చాలామంది గర్భిణీ స్త్రీలు తీసుకునే పోషకాహార విలువలు వీటి కంటే చాలా తక్కువ. శక్తి సుమారు 1420 కేలరీలు, మాంసకృత్తులు 37 గ్రా 200 mg కాల్షియం యినుము 18 mg మాత్రమే వీరు తీసుకుంటున్నట్టు తెలుస్తోంది. ఇటువంటి అసంపూర్ణ ఆహారము తీసికొన్న స్త్రీల గర్భస్థ శిశువు చక్కగా పెరుగదు. ఆరోగ్యంగా బలంగా ఉండే స్త్రీ గర్భము దాల్చినప్పటి నుంచి ప్రసవించే వరకు 10-12 కేజీల బరువు ఎక్కువవుతుంది. కాని బలహీనమైన స్త్రీలలో 5-6 కేజీల బరువు కంటే మార్పురాదు. శిశువు బరువు కూడా తక్కువగానే

వుంటుంది. కనుక గర్భిణీ స్త్రీకి అవసరమైన యితర సదుపాయాలతోబాటు అదనపు పోషకాహారం యివ్వడం ఎంతైనా అవసరం. ఈ విధంగా ఎక్కువ ఆహారం, యినుము, ఫోలిక్ యాసిడ్ కలిసిన మాత్రలు గర్భిణీ స్త్రీకి యిచ్చినట్లయితే తల్లి ఆరోగ్యమేగాక పుట్టిన శిశువు బరువుకూడా పెరుగుతుందని శాస్త్ర పరిశోధనల ద్వారా తెలిసింది. స్త్రీకి యివ్వవలసిన రక్షణ గర్భిణీగా వున్నప్పుడే కాదు; ప్రసవం తరువాత కూడా ఎంతగానో వుంది. శిశువు ఆరోగ్యానికి తల్లిపాలు అవసరం. తల్లిపాలు సరిపోయినంతగా ఉత్పత్తి అవ్వాలంటే తల్లికి అదనపు ఆహారం అవసరం. గర్భిణి స్త్రీకి అవసరమైనట్లే పాలిచ్చే స్త్రీకి కూడా అదనపు పోషకాహారం అవసరం. యింతేగాక ఆరోగ్యంగా వున్న తల్లి తన బిడ్డ శారీరక పెరుగుదలకేగాక, మానసికోల్లాసానికి ఎంతగానో దోహదం చేస్తుంది.

ఈ విధమైన ఆహార రక్షణ స్త్రీలకి యివ్వాలంటే ముఖ్యంగా మన ఆర్థిక పరిస్థితుల్లో మార్పు రావాలి. స్త్రీలకు వాళ్ళ అవసరాలను వాళ్ళు నిర్లక్ష్యం చెయ్యకుండా వారి ఆరోగ్యము కాపాడుకోవడం తెలియాలి. దీనికై వారికి ఆహార లోపం వలన వచ్చే వ్యాధులు, వాటివల్ల తమకు, తమ పిల్లలకు సంసారానికి వచ్చే నష్టాలు అర్థమవాలి. ఉన్నదానితో తృప్తిగా తిని, ఆరోగ్యం కాపాడుకోవడానికి కవసరమైన విద్య పరిమిత కుటుంబము వలన కలిగే లాభాలు వీరికి తెలియజెయ్యాలి. ఇంకా ఉద్యోగాలు కాని వేర్వేరు పనులు చేసే స్త్రీలకీ, అదనపు పోషకాహారం అందజేయాలి. ఈ విషయాలను పరిశీలించి ప్రభుత్వం ఎన్నో పథకాలను చేపట్టింది. వీటిలో అనుబంధ పోషకాహార పథకం, సమగ్ర శిశు అభివృద్ధి పథకం మొదలైన వాటి ద్వారా గర్భిణీ స్త్రీలకు అదనపు ఆహారం అందజేయడం, అదనపు ఆహారపు అవసరాలు, మాతా శిశు సంక్షేమం గురించి స్త్రీలకు బోధించడం, తక్కువ ధరతో పోషక విలువలు కలిగిన వంటకాలను తయారు చెయ్యడం మొదలైన అంశాలు బోధిస్తారు.

ఎన్ని పథకాలువున్నా, పెరుగుతున్న బాధ్యతలు తరుగుతున్న ఆర్థిక స్థితుల మధ్య నలిగిపోతున్న స్త్రీల ఆరోగ్యము కుదుటబడాలంటే స్త్రీ తనకు తానుగా, తన అవసరాలను, సమాజంలో తన పాత్రను బాధ్యతను గుర్తించి, తన ఆరోగ్యము కాపాడుకోవాలి.

# కుటుంబ నియంత్రణ : అడ్డంకులు, అవరోధాలు

వి. శారద

కుటుంబ నియంత్రణ కుటుంబ సంక్షేమంలో ప్రధాన భూమిక వహిస్తున్నదనేది సర్వజన విదితం. అయితే కుటుంబ నియంత్రణను వ్యతిరేకించేవారూ, ప్రతికూల వాదనలూ లేకపోలేదు. ఈ కార్యక్రమాన్ని అటకాయించే సామాజిక సాంస్కృతిక అంశాలు అనేకం ఉన్నాయి. వాటిని గుర్తించి, విశ్లేషణ చేసి విలువ కట్టే ప్రయత్నం అవశ్యం జరగాల్సిన పని. అలా చేయని నాడు కార్యక్రమ నిర్వహణ కుంటుపడుతుంది. దానిని సమర్థ వంతంగా, జయప్రదంగా ఫలవంతంగా నెరవేర్చలేము.

మత ప్రాతిపదిక పైన ఆధారపడే భావాలు, నైతిక దురభిప్రాయాలు, శాస్త్రీయ అవగాహన లోపించినందువల్ల వ్యాపకంగా ఉన్న అపోహలు, రాజకీయ కారణాలవల్ల ఉత్పన్నమైన పొరపాటు ఊహలు, సంప్రదాయానికి భిన్నమైన దానిని స్వీకరించటానికి విముఖత, విలువల విషయంగా విస్తార వ్యాప్తి గల విభిన్న ధోరణులు ఇలా మరెన్నో వ్యతిరేక సామాజిక సాంస్కృతిక అంశాలు కుటుంబ నియంత్రణను నిరోధిస్తున్నాయి

మానవాళి ఆలోచన సాధారణంగా పరిస్థితులపై ఆధార పడుతుంది. కాని పరిస్థితులు మారినంత వేగంగా ఆలోచనా ధోరణి లేక భావ ప్రపంచం మారటం లేదు. అందుచేతనే మన దేశం విచిత్ర స్థితిలో ఉంది. కాలమాన ప్రకారం మనమూ, మన సమాజమూ 20వ శతాబ్దంలో ఉన్నాం. పారిశ్రామి కంగా, సాంకేతికంగా ప్రధానంగా 19వ శతాబ్దంలో ఉన్నాం. అయితే మన ఆలోచనలు మధ్యయుగపునాటివి. 15, 16 శతాబ్దాల కాలపువి వాటిలో ఎదుగూ బొదుగూ పెద్దగా కన్పడటం లేదు. పాత కాలపు భావాలతో ఈ కాలపు సమస్యలను పరిష్కరించుకో లేము. కాగా క్రొత్త బాటలను అనుసరించ లేక సతమత మవుతున్నాం. విషమస్థితి ఏర్పడింది. మన గతం మనలను వెన్నాడుతున్నది. ఆధునిక ప్రపంచపు అవసరాలు, ఈ కాలపు మనిషి

అస్తిత్వం కుటుంబ నియంత్రణాన్ని అనుసరించమని మనలను ప్రోత్సాహం చేస్తుంటే మన ప్రాచీన భావజగత్తు మనలను దాని పట్ల విముఖులను చేస్తున్నది.

ఒక్కొక్క అంశాన్ని విడి విడిగా తీసుకొని విచారించి పరిశీలించ వలసిన ఆగత్యం ఉంది. తరువాత అధ్యయన ఫలితాన్ని ఇతరమైన విషయాలతో, అంశాలతో సమన్వయ పరచుకొని ఆలోచించాలి. అప్పుడే మనకు సమగ్రంగా స్వరూప అవగాహన ఉపలభిస్తుంది.

దేశ జనాభా పెరుగుతున్నందున సామాజిక స్థితి గతులు ఇబ్బంది కరంగా పరిణమిస్తున్నాయి. కనుక "పరిమిత సంతానాన్ని పొందండి" అని ప్రబోధం చేస్తే "నారు పోసిన వాడు నీరు పోయడా ?" అనే సామెతను ఉటంకించి కుటుంబ నియంత్రణ ప్రచారాన్ని ఎద్దేవ చేస్తున్నారు కొందరు. దీనిని కాదంటే నాస్తికత్వమని ఈసడిస్తున్నారు. ఈ విమర్శ సహేతుకం కాదు. ఏమైనా ఆస్తిక వాదానికి, ఈ పద్ధతి ఆలోచనకూ పొంతన లేదు. ఇంకా మించుగా అన్ని మతాలు 'పురుష ప్రయత్నానికి' ప్రాధాన్యత ఇచ్చాయి. (తనకు తాను సహాయం చేసుకోదానికి ప్రయత్నం చేసిన వానికే భగవంతుడు సాయం చేస్తాడనే నానుడి వింటున్నాం). మనిషికి ఆలోచించగల శక్తి ఉంది. వివేచన చేయగల సత్తా ఉంది. ఊహించగల నేర్పు ఉంది. ఆస్తిక మతాల ప్రకారం భగవంతుడు మనిషికి బుద్ధిని ప్రసాదించాడు. కనుక ఆ వర ప్రసాదాన్ని మనిషి వాడుకోవాలి పూర్వాపరాలను పరిశీలించి, తర్క వితర్కాలు చేసి, సరియైన నిర్ణయాలకు వచ్చి, వాటిని ఆచరణ రూపంలో పెట్టాలి. అలా చేయకుండా, స్తబ్ధతకు లోనయి అకర్మణ్యత్వానికి పాలు పడటాన్ని భగవంతుడు క్షమించడు.

కొంతమంది కుటుంబ నియంత్రణాన్ని ఆమోదిస్తారు. కాని దాని కవసరమైన జన్మ నిగ్రహ సాధనాల వాడకను, గర్భస్రావ విధాన వినియోగాన్ని గర్హిస్తారు. జన్మ నిగ్రహాన్ని సహజ రీతులలో సాధించాలంటారు. కృత్రిమ గర్భ నిరోధక సాధనాలను అవినీతికరమైన వాటిగా పరిగణిస్తారు. సహజరీతులు సాధారణంగా తక్కువ ఉపయోగాన్ని చేకూరుస్తాయని, తక్కువ ప్రయోజనాన్ని సాధిస్తాయని మనకు తెలుసు. అనుభవం ఈ విషయాన్ని మనకు అందించింది. దైవ వర ప్రసాదమైన సంతానాన్ని పుట్టకుండా నిరోధించటం - అసహజ విధానాల ద్వారా - పాపమనే నైతిక భావన సమాజంలో

ప్రబలంగా ఉంది. ఇది పొరపాటు ఆలోచనా ధోరణి. స్త్రీ పురుషుల ప్రతి
కలయిక వల్ల సంతానం కలగడం లేదు. శుక్ల శోణిత సంయోగం వల్ల మరో
జీవి ఉదయిస్తుందని మనకు తెలుసు. కాగా పురుషుని శుక్లంలో కోట్ల సంఖ్యలో
వీర్యకణాలు ఉంటే ఏ ఒక్కటో మాత్రమే గర్భధారణకు కారణభూతమవు
తున్నది. తతిమ్మావి నిరుపయోగమై నశిస్తున్నాయి. ఇదంతా సృష్టిలో కను
పించే దుబారా లేక నష్టం. కనుక మనిషి ఏదో నష్టం కలిగిస్తున్నాడనుకోవడం
తప్పు. దుబారాను మనిషి పెంచుతున్నాడని భ్రమపడి తదనుగుణమైన నడ
వడిని చేపట్టటం మంచిది కాదు. సృష్టిలో ఉన్న దుబారాను అంకట్టడం తప్పని
నాస్తికులు, హేతువాదులు అన్నా లేక దైవ సృష్టి క్రమాన్ని ధిక్కరించినందు
వల్ల పాపమార్గాన మనిషి పయనిస్తున్నాడని ఆస్తికులు భావించినా రెండూ
పొరపాటు అభిప్రాయాలే. జీవశాస్త్రాన్ని కొంతగా పరిశీలిస్తే ఇలాంటి
అపోహలు తొలగి పోతాయి.

గర్భస్రావాన్ని గురించిన మరో దురభిప్రాయం ప్రజలలో బాగా నాటు
కొని పోయింది. గర్భస్రావం భ్రూణ హత్యతో సమానమని కొందరి అభి
ప్రాయం. కనుక వారి దృష్టిలో అది నింద్యము. ఈ భావాన్ని రెండు రకాలుగా
విశ్లేషణ చేయవచ్చును. గర్భస్థ పిండానికి కొంత కాలం వరకు ప్రత్యేకంగా
జీవం ఏర్పడదు. సాధారణంగా మానవ దేహంలో ఉండే కణాల లాంటిదే
అదీను. మనిషి శరీరంలో కణాలు కోకొల్లలు. మరో రకంగా ఆలోచిస్తే
పిండం తల్లి శరీరంలో భాగం. ఆమె శ్రేయస్సు దృష్ట్యా, ఆమె అనుమతితో,
ఆమె శరీరంలో భాగాన్ని విడదీయటం నిస్సందేహంగా నైతిక చర్యయే.
ఎలా చూచినా గర్భస్రావం అవినీతికరం కాదు. శాసనానికి నీతికి ఉన్న
సంబంధాన్ని మనం గుర్తించాలి. శాసనబద్ధమైనవన్నీ నీతివంతం కావు.
నైతిక చర్యలన్నీ శాసనబద్ధం కావు. శాసనాలు సామాజిక స్థితిగతులకు,
సాధారణంగా, అనుగుణంగా ఉంటాయి. సామాజిక పరివర్తన కాలాను
గుణంగా ఉంటుంది. ఒకనాడు మనిషిని బలి ఇవ్వటం ధర్మం. ఈనాడు నేరం.
అలాగే అలనాడు బానిసత్వం శాసన సమ్మతం. ఈనాడు శాసన విరుద్ధం;
నేరం. పురుషుడు వ్యభిచారం చేస్తే "సీత" (Sita : Suppression of
Immoral Traffic Act) దృష్టిలో నేరం కాదు. కాని అది అవినీతికరమే.
ఏ పుట్ట కురుపు వ్యాధితోనో విపరీతంగా బాధపడుతున్న వ్యక్తి తనకూ తన
వారికీ బాధ, వ్యథ. కష్టం తొలగించే నిమిత్తం ఆత్మహత్య చేసుకో

సాగించవలసిందే! ఇది స్త్రీపురుషుల మధ్య అసమానత్వానికి నిదర్శనం. అపరిమిత కుటుంబాభివృద్ధి వల్ల జనాభా పెరుగుదలకు దారితీయటం గమనిస్తున్నాం. స్త్రీపురుషులిద్దరూ-మధ్యతరగతిలో కూడా- శ్రమిస్తూ ఉద్యోగాలు చేసి సంపాదిస్తున్న ఈ రోజులలో ఈ తేడాను, పాటించటం, తదనుగుణమైన సంక్షేమవ్యతిరేకపు నడవడిని అలవరచుకోవడం పురుషాధిక్యపు విలువలను అమాయకంగా ఆమోదించడంవల్లనే సంభవిస్తున్నది.

దేశ శ్రేయస్సు దృష్ట్యా సైన్యం - రావాలిట! అందులో ముఖ్యంగా పదాతి దళాలు అవసరమట! కనుక దేశ జనాభా పెరగాలట. ఇది ఒక విపరీత సిద్ధాంతపు ఆలోచన. దీనికి జర్మనీ దేశపు ఒకనాటి నియంత హిట్లర్ ప్రతీక. ఇది ప్రధానంగా పురుషుల మస్తిష్కంలో పుట్టే భావం. యుద్ధంలో బలికావడానికి ఉద్దేశించి ఏ తల్లీ బిడ్డలను కనదు కనుకనే స్త్రీలు సామాజిక శాంతిని, ప్రపంచ శాంతిని అభిలషిస్తున్నారు. నిజమైన శాంతి ఉద్యమాలలో చొరవ చూపిస్తున్నారు, పాల్గొంటున్నారు. నాయకత్వం వహిస్తున్నారు. మరో మాట. కండబలం రోజులు పోయాయి. యుద్ధాలలో మీటనొక్కితే వేలమైళ్ళ అవతల ఉన్న పట్టణాలను, దేశాన్ని సమూలంగా సర్వనాశనం చేయగల శక్తిని సంపాదించాయి పెద్దదేశాలు. మీటనొక్కడానికి కండబలం అక్కర లేదు. అసంఖ్యాక ప్రజానీకం అసలే అవసరంలేదు. ఇదంతా యుద్ధం మంచిదని, అవసరమని భావించినపుడు కూడ ఆలోచించవలసిన విషయం. కాబట్టి ఏ దృష్ట్యా చూచినా జనాభాను విపరీతంగా పెంచుకోవడం, కుటుంబాలను అపరిమితంగా వృద్ధి చేసుకోవడం అవాంఛనీయం.

మరియొక ధోరణి ఇటీవల ప్రచర్చితమవుతున్నది. కొందరు వ్యక్తిగతంగా కుటుంబ నియంత్రణాన్ని ఆమోదిస్తారు, అనుసరిస్తారు కూడాను; కాగా వారు ప్రభుత్వంపై ఉండే వ్యతిరేకతతో, ప్రభుత్వం మీదనున్న దురభిప్రాయంతో కుటుంబ నియంత్రణాన్ని ప్రజా వ్యతిరేక కార్యక్రమమని ప్రచారం చేస్తారు. ఇది ద్వంద్వ నీతికి నిదర్శనం. అంటే వారికి వారి కుటుంబీకులకు ఒక నీతి, తదితరులకు మరియొక నీతి. వారికి పరిమిత కుటుంబం కావాలి; ఇతరులకు అపరిమిత కుటుంబం అవసరం. ఏమి తర్కం? ఏమి నీతి! ప్రభుత్వం మీద ఉన్న కోపంతో, కసితో ప్రభుత్వం ప్రచారం చేసి అమలు పరిచే మంచి పనులను వ్యతిరేకించటం తెలివి తక్కువ కాదా?

కలరా వ్యతిరేక సూదిమందులను, ఇతర వ్యాధి నిరోధక చర్యలను, ఈసడించడం, తీసుకో నిరాకరించడం అవ్యక్తం కాదా?

అన్నింటికన్నా మరో భావం విస్తారంగా కాకపోయినా కొలది మంది బుద్ధి జీవుల మన్ననలను పొందింది. ఫలాని దేశం సంక్షేమ దేశంగా పరిగణింపబడుతున్నది. ఆ దేశం బహుసంతానాన్ని అభిలషిస్తున్నది; ప్రభుత్వం ప్రోత్సాహపరుస్తున్నది. కనుక మనమూ అలాగే చేయాలి. ఇది "పులిని చూచి నక్క వాత పెట్టుకోవడం" అంటాము. తతిమ్మా సంక్షేమ రాజ్యాలు కుటుంబ నియంత్రణాన్ని ప్రచారం చేస్తున్నాయే! వాటిని చూచి మనం నేర్చుకోవచ్చు కదా! వాటిని అనుసరించవచ్చు కదా! "మంది ఎక్కువయితే మజ్జిగ పల్చనవుతుందనే" సామెత మనం జ్ఞాపకం ఉంచుకోవలసిన తరుణం ఆసన్నమయింది. ఎక్కువమంది జనాభా ఉన్న దేశంలో ప్రజలకు ఇతోధికంగా సౌకర్యాలు ప్రభుత్వం ఇవ్వలేదు. ఈ వాస్తవాన్ని గుర్తించడం తప్పనిసరి.

ఇంకా మరి రెండు అంశాలను ముఖ్యమైనవిగా పరిగణించాలి. ఒకటి సాధారణంగా వంధ్యీకరణ ఆపరేషనులను చేయించుకోవటానికి ఎక్కువ మంది పురుషులలో వైముఖ్యత. కారణాలు రెండు. తన వీర్యశక్తి నశిస్తుందనే తప్పుడు భావన మొదటిది. భార్య ఏకారణం వల్లనైనా చనిపోతే ఆపరేషను చేయించుకున్న తను ఏ స్త్రీకి సంతానాన్ని ప్రసాదించలేడు కనుక, తనకు ద్వితీయ వివాహం కాజాలదనే భావం రెండవది. ఇది కేవలం స్వార్థపూరిత భావం అదీగాక పురుషాధిక్య విలువల ప్రదర్శన. జీవిత సహచరిని గురించి ఆలోచించడు. ఆమెను ఆపరేషను చేయించుకోమంటాడు. మరి తను చనిపోతే, ఆపరేషను చేయించుకున్న భార్య ద్వితీయ వివాహానికి ఈ ఆపరేషను అడ్డురాదా? అది ఆ పురుషునికి అనవసరం. పైగా బిడ్డలున్న తల్లి అయితే - పురుషునంత తేలికగా స్త్రీ రెండోపెళ్ళి చేసుకోదుగా! మగవాని దీమా, స్వార్థం, అహంకారం ఈ వైఖరిలో మిళితమయి ఉన్నాయి.

చివరిది చాలా ముఖ్యమైన ప్రతికూల అంశం. సమాజంలో సంక్షేమ కార్యక్రమాలు తగినంతగా లేవు. ప్రతిమనిషికి ఆహార విద్యా ఉద్యోగ ఆరోగ్య గృహ వసతులను కల్పించలేకున్నది సమాజం. వృద్ధాప్య పింఛను, విశ్రాంతి సౌకర్యాలు, అనారోగ్య సమయంలో పోషణ సదుపాయాలు, నిరుద్యోగభృతి

వగైరాలు ఇంచుమించుగా అధిక సంఖ్యాకులకు లేనట్లే. ఇలాంటి పరిస్థితుల్లో తమ సంతానమే తమకు ఆశ్రయం రక్షణ ఇస్తారని, పోషణ చేస్తారని, తల్లిదండ్రులు ఆశించడంలో తప్పులేదు. అందుకే బీదవారు ఎక్కువమంది సంతానాన్ని కంటున్నారు. వారికి చదువుచెప్పించే ప్రయత్నం మానివేసి 7,8 సంవత్సరాలు రాగానే పనులలో ప్రవేశపెట్టుతున్నారు. ఇది ప్రమాదకరమైన ధోరణి. దీనివల్ల నిరక్షరాస్యులు పెరుగుతారు. ప్రజల సాంస్కృతిక స్థాయి పడిపోతుంది. సమాజ పతనం ప్రారంభమవుతుంది.

ఈ విషవలయంలోనుండి వెలువడడానికి ఏకైక మార్గం సంక్షేమ కార్యక్రమాలను సర్వతోముఖంగా పెంచడమే. బహుశః ప్రభుత్వం ఒక్కటే ఈ పని చేయజాలదు. అందరూ - అందులో ముఖ్యంగా సంపన్నులు - పూనుకోవాలి. ప్రజలు స్వచ్ఛందంగా సంక్షేమ కార్యక్రమాలు చేపట్టాలి. 'మనకు ఏ లోటూ లేదు కదా' యని సంపన్నులు ఉపేక్ష వహిస్తే 'సహేంద్ర తక్షకాయస్వాహా' అన్నట్లు తతిమ్మా సమాజంతోపాటు వారూ ప్రమాదంలో పడిపోతారు. 'యథా ప్రజా తథా రాజా' ఈనాటి సామెత. ప్రజల స్థాయికి అనుగుణమైన ప్రభుత్వమే వస్తుంది కాని మరో ప్రభుత్వం రాదు కదా! కనుక సంక్షేమ కార్యక్రమాలు, ప్రబోధం ఏకకాలంలో జరగాలి. ప్రజలను విజ్ఞానవంతులను చేసి, వారిలో చైతన్యాన్ని రేకెత్తించి, వారి పరిస్థితిని వారు బాగు చేసుకోవాలనే సంకల్పం వారికి కల్గించి, దూరదృష్టితో సంచరించగల విజ్ఞత వారిలో ఉదయించే పరిస్థితులను సృష్టి చేయటం ప్రభుత్వ విధి; ప్రజల కర్తవ్యం కూడాను.

కుటుంబ నియంత్రణకు సామాజికంగా సాంస్కృతికంగా అవరోధాలుగా తయారయిన అంశాలను అధ్యయనం చేసి, ఆ అడ్డంకులను అధిగమించడానికి సమాయత్తం అవటం అత్యంత అవసరంగా చేపట్టవలసిన కార్యక్రమం.

# ప్రసార సాధనాల కృషి

తురగా జానకీ రాణీ

అక్షరాస్యత ఎంతో తక్కువగా వున్న మన దేశంలో ప్రసార సాధనాలు అంటిలో రేడియో పాత్ర ఎంతో ముఖ్యమయినది. ఇది అందరూ అంగీకరించే సంగతే. పురుషులకంటె స్త్రీలలో అక్షరాస్యత శాతం తక్కువ కనక. వారికి రేడియో వంటి శక్తివంతమైన సాధనం మరింతగా ఉపయోగపడగలదు. ఆ సాధనం అందిస్తున్న సందేశాల ప్రభావము ఎక్కువగానే వుంటుంది. రేడియో విజ్ఞాన వినోదాలను అందిస్తున్నదన్న భావం కూడా మన దేశ ప్రజలలో వున్నది.

అనేక కేంద్రాలలో జరిపిన పరిశీలనవల్ల స్త్రీలే ఎక్కువగా రేడియో వింటారనీ దాని ద్వారా చెప్పిన విషయాల్లో అధిక విశ్వాసం వుంచుతారని కూడా తేలింది ప్రతి ఒక్క వనిత, ప్రతి ఒక్క కార్యక్రమము వింటున్నదా, చెప్పే ప్రతివిషయం ఆమెకి అర్థమవుతున్నదా, అర్థమైనది ఆచరించ గలదా అనే ప్రశ్నలు ఎవరికైనా కలుగుతాయి. ఇవి చాలవరకు అసాధ్యమైన విషయాలే. కాని మనిషి ఆరోగ్యము, అనారోగ్యము చికిత్సావకాశాలు, రోగ నిరోధక మార్గాలు - వీటిగురించి కొంత ప్రజలలో గుర్తింపు కలిగిన మాట వాస్తవం. ఏ వ్యాధి అయినా శాపవశాత్తు కలిగినది కాదని, చికిత్సకు అవకాశ మున్నదనీ కొంతవరకైనా ప్రజలు యీనాడు గ్రహిస్తున్నారంటే అందులో రేడియో ప్రచారాల పాత్ర చాల వరకు వున్నదని అంగీకరించాలి.

అర్ధ శతాబ్దికి పైగా మన దేశంలో రేడియో కార్యక్రమాలు ప్రసార మవుతున్నాయి. మొదట సంగీతం, ప్రసంగాలు నాటికలు మొదలైన వాటితో ఆరంభమయినప్పటికి రానురాను గ్రామీణులు, స్త్రీలు, పిల్లలు కార్మికుల వంటి ప్రత్యేక వర్గాల కోసం అనేక కార్యక్రమాలు చేర్చబడ్డాయి. క్రమంగా విద్య, విశ్వవిద్యాలయ కార్యక్రమాలు చేర్చారు. కుటుంబ నియంత్రణ, కుటుంబ సంక్షేమం, ప్రజారోగ్య విషయాలు, ప్రసారాలు చెప్పుకో దగిన సంఖ్యలో మొదలైనాయి. చిన్న కుటుంబం వలన ప్రయోజనాలు, కుటుంబ నియంత్రణ పద్ధతులను గురించి స్త్రీలలో పరిజ్ఞానం పెరగడానికిగాను రేడియో ప్రసారాలే

అంటే అతిశయోక్తి కాదు. రేడియో అంటే కుటుంబ నియంత్రణ విషయాలే అనే విమర్శ కూడా దేశంలో ఉన్నది.

ఈనాడు సుమారు 90 కేంద్రాల నుండి రేడియో ప్రసారాలు జరుగుతున్నాయి. వీటిలో 22 కేంద్రాలలో కుటుంబ సంక్షేమ ప్రసార విభాగాలు, మరో 14 కేంద్రాలలో ప్రత్యేక క్షేత్రోద్యోగుల నియంత్రణ అనే ఉప విభాగాలు వున్నాయి. ఇవికాక మొత్తం అన్ని కేంద్రాల నుండి ఆరోగ్య కుటుంబ సంక్షేమ కార్యక్రమాలు అనేక రూపాలలో ప్రసారమవుతున్నాయి.

ప్రసార స్వరూపం, ప్రక్రియలు : శ్రోతలకు సాధారణంగా సినిమా పాటలు, వార్తలు, నాటికలు, కథానికలు కబుర్లు ఇటువంటివి వినాలన్న కుతూహలం వుంటుంది. విజ్ఞాన విషయాలు వారికి ఎంత ఉపయోగకరమైన వయినా శ్రద్ధగా వింటారన్న నమ్మకం లేదు. అందుచేత ఆరోగ్య విషయాలు చెప్పేటప్పుడు ఆసక్తి కలిగించే విధానాలు అవలంబించవలసి వస్తుంది. గర్భిణీస్త్రీ జాగ్రత్తలను గురించి చెప్పినా, పసిపిల్లల జబ్బులను గురించి చెప్పినాగానీ ప్రసంగాలు సాధ్యమైనంత వరకు తేలికైన భాషలోనే వుంటాయి. ఒకే కంఠం ప్రసంగంగా చెప్పేకంటే ఆ విషయాన్నే స్పష్టీకరించి ఒకడు అడిగే ప్రశ్నలకు జవాబుల్లో చెప్పిస్తే అవి పరిచయాలు-యింకా కొందరు స్త్రీలుగానీ, కార్మికులుగానీ, బాలలుగానీ జనుల నడిగి తెలుసుకోవడం-ప్రశ్నోత్తరాలు నలుగురైదుగురు అడిగి వాటికి-అంటే వారి సమస్యలకు జవాబు సంభాషణ ధోరణిలో జవాబు చెప్పటం,-నాటికలు, ఒక సంఘటనచుట్టూ అల్లి కథతో ఒక సమస్యకు పరిష్కారాన్ని చూపిస్తూ సందేశాన్నివ్వటం-రూపకాలు-అంటే మూడు నాలుగు కంఠాలు ఒక విషయాన్ని గురించి చెప్పడం, క్విజ్-ఒక నిపుణుడు అడిగే ప్రశ్నలకు స్త్రీలు, పిల్లలు, యువతీ యువకులు జవాబులు చెప్పటం-పాటలు, సందేశాన్ని జొప్పించి, స్వరబద్ధంగా, వాద్య సహకారంతో శ్రావ్యమైన కంఠాలు ఆలపించటం, బృందగీతాలు, ప్రబోధాన్ని అందించే ఉత్సాహ పూరితమైన నినాదాలతో నిండినవి - యివన్నీ రకరకాల ప్రసార ప్రక్రియలు.

ఈ రూపాలన్నిటినీ కూడా ఆరోగ్య విషయాలను చెప్పడానికి వినియోగిస్తున్నారు ప్రస్తుతం. విషయం, సందేశం ఏదైనప్పటికి ప్రకృతి ఆకర్ష

ణీయంగా, శ్రోతలను ఆకట్టుకొని, చివరవరకు వినేటట్టు చేయాలనే ఉద్దేశ్యం తరచుగా ప్రసారాధికారులు చెబుతూ వుంటారు. ఎప్పటి కప్పుడు మాటలలో నవీనత కురిపించే ప్రయత్నాలు జరుగుతుంటాయి. ప్రసారికలల్లో కూర్పులు, చెప్పే కంఠాలలో మార్పులు, యివన్నీ కూడ నవ్యతను దృష్టిలో పెట్టుకొని చేస్తూనే వుంటారు. ఈ ప్రక్రియలన్నీకూడ జనరల్ ప్రోగ్రామ్‌నూ, ప్రత్యేక వర్గాలను ఉద్దేశించిన కార్యక్రమాల్లోనూ - స్పెషల్ ఆడియన్స్ ప్రోగ్రామ్స్- వినియోగిస్తుంటారు.

వ్యవధి : నాటకాలు తప్పిస్తే, మరే యితర ప్రసార ప్రక్రియ (స్పోకెన్ వర్డ్) కూడా 15-20 నిమిషాలకు మించకుండా చూడాలనే ప్రయత్నం సాధారణంగా జరుగుతుంటుంది. మనిషి కనబడకుండా, మాట వింటున్నప్పుడు ఎక్కువ వ్యవధిగల కార్యక్రమాలు - సంగీతం కాకుండా-అంతగా శ్రోతలను ఆకట్టుకోలేవనే అభిప్రాయమున్నది. ప్రశ్నోత్తరాలు, అభిప్రాయవేదిక చర్చలు, గోష్ఠులు, వీటిల్లో వివిధ రకాల కంఠాలు వినిపిస్తాయి. కనుక ఒక్కొక్కసారి అరగంట వరకు వీటిని ప్రసారం చేస్తుంటాము. ఏమైనప్పటికీ 5 నుండి 15 నిమిషాలలోపు వుండే అంశాలే ఎక్కువ.

ప్రసార విషయాలు, వక్తలు : ఆరోగ్య విషయాలను నాలుగైదు రకాలుగా విభజింపవచ్చును. 1. సాధారణ వ్యాధులు - అంటే జలుబు, దగ్గు తలనొప్పులు, జ్వరాలు, ఆయా ఋతువులలో వచ్చే సుస్తీలు వగైరాలు, 2. ప్రత్యేక ఆరోగ్యాంశాలు-గర్భిణీ స్త్రీలు పసి పిల్లలు స్త్రీల ఋతు సంబంధమైన వ్యాధులు. కొన్ని వ్యక్తులలో వుండేవి కార్మిక వర్గాలు, వృద్ధులు. 3. దీర్ఘకాలిక వ్యాధులు 4. అంటువ్యాధులు-ఆయా కాలాల్లో వచ్చేవి నీటి కాలుష్యం వలన వచ్చేవి. 5. అనారోగ్యాలు.

వీటి అన్నిటిలో కూడా రోగలక్షణాలు చికిత్సా విధానం, తీసుకోవలసిన జాగ్రత్తలు, నివారణోపాయాలు యివి చెబుతారు వక్తలు. ఆయా వైద్యరంగాలలో నిపుణులైనవారే ప్రసంగాలు, చర్చలు, ప్రశ్నోత్తరాల కార్యక్రమాల్లో పాల్గొంటారు. కనుక చెప్పే విషయంలో పొరపాట్లు సాధారణంగా వుండవు. సరళమైన భాషలో వినేందుకు మధురంగా కాకపోయినా స్పష్టంగా ఉండే కంఠస్వరాలుకల వ్యక్తులనే ఎంపిక చేసికొని వారినే ఆహ్వానించడం జరుగుతుంది.

శ్రోతలలో ఏ వ్యాధిని గురించిగానీ భయాన్ని రేకెత్తించే విషయాలు గానీ సిరాశాధోరణిలో వర్ణనలుగానీ - చెప్పటం భావ్యంకాదనే సంగతి వైద్యులుకూడా రేడియో ప్రసారాల్లో పాల్గొనేటప్పుడు గుర్తిస్తారు. అనారోగ్యం తాత్కాలికంగానీ దీర్ఘకాలికంగానీ, శారీరకంగానీ, మానసికంగానీ, ప్రతి దానికి నివారణ, చికిత్స ఉన్నాయి. ఒక బలహీనత, వైకల్యం కలిగినా అనేక మార్గాల్లో జీవితం సుఖప్రదం చేసుకోవచ్చును అనే ధైర్యాన్ని శ్రోతల కివ్వడం, యీ కార్యక్రమాల లక్ష్యం. వింటున్నవారు ఏదో ఒక రుగ్మత వల్ల బాధపడుతుండవచ్చును. వారికి ధైర్యమునిచ్చి ముందు జాగ్రత్త పడాలనే ధ్యాసను కలిగిస్తాయి ఈ ప్రసారాలు.

ముఖ్యంగా స్త్రీలు తమ అనారోగ్య విషయాలు గోప్యంగా వుంచి, చికిత్స వాయిదా వేస్తూ ఉండడం. తమ శరీరధర్మాలేమిటో తెలియక యితరులను అడిగి తెలుసుకునే అవకాశంలేక లో లోపల కుమిలిపోయేవారికి, యీ వైద్యుల మాటలు ఎంతో సన్నిహితంగా, వూరటగా ధ్వనిస్తాయి. ఈ నాటికి భూత, పిశాచాలను, దుష్టశక్తులను నమ్మేవారున్నప్పటికి ఒక్కొక్క సందర్భంలో రేడియోలో ఫలానా విషయం చెప్పారు అనగానే, అదొక ముఖ్య వార్తగా గుర్తించేవారు వున్నారు. శాస్త్రీయ పద్ధతిలో అనేక వ్యాధులను గురించి అనుమాన నివృత్తికే తావున్నది.

మహిళా శ్రోతలు : రేడియో శ్రద్ధగా వినేవారిలో స్త్రీలే ఎక్కువ అని యిదివరకే అనుకున్నాము. ఎక్కువ మంది స్త్రీలు ఇళ్ళలో వుండడమూ పొలాలోకి పనుల్లోకి వెళ్ళినా ట్రాన్సిస్టర్ల వంటివి తీసుకవెళ్ళడం పరిపాటి కనుక ప్రసారాలువినే అవకాశం వీరికి ఎక్కువగా వుంది. ఐతే, అధిక భాగం స్త్రీలు, ఏ కార్యక్రమాలు వింటారు, విన్నదానిలో అర్థం చేసుకొనేది ఎంత, అంటే కొంత సందేహానికి చోటున్నది. అవ్యక్తంగా ఏదో ధ్వని, ఎవరు ఏదో చెబుతున్నారు అనే దృష్టి తప్ప అసాంతం వినే అలవాటు, బోధపరచుకునే శక్తి కొద్దిపాటి విద్య కలవారికి వుంటున్నది కానీ, బొత్తిగా నిరక్షరాసులకి లేదనే ఒప్పుకోవాలి.

ఈ సందర్భములో గ్రామీణ మహిళా సంఘాలు, మహిళా సంక్షేమ కార్యకర్తలు, కొద్దిపాటి చదువుకుని వికాసం పొందిన యువతులు దగ్గర

నుండి స్త్రీలకు యీ ప్రసారాలు వినిపిస్తే కొంత ప్రయోజనం వుండగలదు. దీన్ని **Guided listening** అని వ్యవహరిస్తుంటారు.

మరో పద్ధతి - శ్రోతలకు, ప్రసంగించే వారికి మధ్య ఒక సంబంధం ఏర్పరచటం- అంటే వారి పేర్లు రేడియోలో ఏదో విధంగా వినిపించి, ఒక క్రమ పద్ధతిలో వారికి కార్యక్రమాల్లో భాగస్వామ్యం కలిగించడం. ఈ పద్ధతి కూడా కొద్దిపాటి చదువుకున్న వారికే, లేక ఆ చదువుకున్నవారి విషయంలో కార్యక్రమములు వినే వారికి మాత్రం ఉపయోగించగలదు. **Involvement** అనే పదం యీ సందర్భంగా వర్తిస్తుంది.

మరొక ముఖ్యాంశము ఏమిటంటే- ఉన్నత విద్యాభ్యాసం చేసి ఇంగ్లీషు భాషలో విజ్ఞాన విషయాలను ప్రశ్నించ గలిగే వారికి రేడియో కార్యక్రమములు ఆరోగ్య విషయములలో శ్రోతగా యిచ్చే సమాచారం ఉండక పోవచ్చును. కాని అటు వంటి వారికి కూడా కార్యక్రమములు చెవిన పడ్డప్పుడు ప్రతి ఆరోగ్య విషయాన్ని గురించి ప్రాథమికమైన పరిజ్ఞానం, అడపా తడపా ప్రాప్తించ వచ్చును.

నిజమైన సేవ చేయవలెనంటే : 1. ఆరోగ్య కార్యక్రమముల కోసం కేటాయింపు పెంచాలి. 2. గ్రామాల్లో అనారోగ్య సమస్యల గురించి అభిప్రాయములు, వాటి పరిష్కారాలు ఒక నిర్ణీత సమయంలో ప్రతి రోజూ ప్రసారం చెయ్యాలి. 3. గృహ వైద్యానికి, అన్ని పద్ధతుల వైద్య విధానాలకు సమాన ప్రతిపత్తి యివ్వాలి. 4. మహిళా సంఘాలు, మహిళా సంక్షేమకార్య కర్తలు బాధ్యతాయుతమైన పాత్ర వహించి, **Feed back**- అంటే అభిప్రాయములను రేడియో కేంద్రాలకు తెలుపడం అవసరం, 5 తాలూకా కనీసం రెండు మూడు మండలాలకు కలసి ఒక్క చోట, సదస్సులు నిర్వహించి నిపుణులైన వైద్యులు గ్రామీణ స్త్రీల నుద్దేశించి ప్రసంగించే ఏర్పాటు చెయ్యాలి. అవి వరుసగా ప్రసారం చెయ్యాలి. అప్పుడు ప్రజాశక్తి ఎక్కువగా వుంటుంది.

ఉన్నంతలో రేడియో వల్ల ఆరోగ్య అనారోగ్య సమస్యలను గురించి చిన్న కుటుంబం ఆదర్శం గురించి కొంత వరకు గుర్తింపు, స్పృహ, ఆసక్తి స్త్రీలలో పెరిగింది, దూరదర్శన్, శక్తివంతమైన దృశ్య సాధనమే. ప్రస్తుత పరిస్థితిలో అధిక భాగం ప్రజలకు ప్రాంతీయ భాషలో ప్రతి రోజూ నిర్ణీత సమయంలో ఆరోగ్య విషయాలను ప్రధానంగా చూపడం లేదు. కనుక, యింకా ఆ కార్యక్రమ ప్రభావం గురించి ప్రస్తావించడం సాధ్యం కాదు.

# జనాభా విద్య ఆవశ్యకత

మమతా లక్ష్మన్న

రెండవ ప్రపంచ యుద్ధము తరువాత అభివృద్ధి చెందుతున్న దేశాలలో వైద్యశాస్త్ర పురోగమనము వల్లను ఆధునిక ఔషధములను కనుగొనుటవల్లను మరణముల రేటు అతి శీఘ్రముగాను, జననముల రేటు బహు స్వల్పముగాను తగ్గి జనాభా సమస్యకు దారి తీసినది. దేశ జనాభా 1830లో ఒక్క బిలియను అగుటకు 2000 మిలియనుల సంవత్సరములు పట్టినది. 1930లో జనాభా 2 బిలియనులగుటకు 100 సంవత్సరములు మాత్రమే పట్టినది. 1960లో అనగా 30 సంవత్సరములలోపుగా జనాభా మూడు బిలియన్లు అయినది. 1975లో అనగా 15 సంవత్సరములలోపుగా జనాభా 4 బిలియన్లు అయినది. రాబోయే 20 సంవత్సరములలోపుగా మరి రెండు బిలియన్లు పెరుగనున్నది. దీనితో 1995వ సంవత్సరమున ప్రపంచ జనాభా 6 బిలియన్లు కానున్నది. అదే విధముగా హిందూదేశ జనాభా కూడా ఒక శతాబ్దములో అనగా 1901లో వున్న 236.3 మిలియన్ల జనాభా ఒక్క బిలియను కానున్నది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో జననముల రేటు ఎక్కువగా వుండుటవల్ల 0-15 సం॥ వయస్సులోగల జనాభా కూడా ఎక్కువగా వున్నది. మన దేశములో జనాభా 50 శాతము 20సం॥ వయస్సు లోపల, 39 శాతము 15 సం॥ వయస్సులోపు గలదు. కావున యితరులపై ఆధారపడే జనాభా మొత్తము జనాభాలో ప్రధాన స్థానము వహిస్తుంది. ఈ బాల బాలికలు వుత్పత్తి చేయునది ఏమియు లేక పోయినను అవసరములు మాత్రము మెండు రాబోయే 10 లేక 20 సంవత్సరాలలోపుగా ఈ బాల బాలికలు తల్లి తండ్రులై వారి వారి కుటుంబములను మొదలిడుదురు.

## జనాభా విద్య

విద్యా కార్యక్రమమునందును, విద్యార్జితము నందును జనాభా విద్య ఒక భాగము. పాశ్చాత్య విజ్ఞానులు, విద్యా బోధకులు, సాంఘిక శాస్త్రజ్ఞులు

(ఫ్రెడ్రిక్ ఆస్‌బర్న్ మరియు ఫ్రాన్క్ లోరిమర్) తూర్పు ఐరోపా దేశములలో మానవ ప్రత్యుత్పత్తి అతి శీఘ్రముగా తగ్గుటను గూర్చి 1940లో ఆలోచించ మొదలిడిరి. అటుపై వీరు పాఠశాలల పాఠ్య భాగములలో జనాభా విద్య చేర్చ వలసినదిగా సిఫారసు చేసిరి. దీని వల్ల పిల్లలు జనాభా కదలికలు మరియు మానవ ప్రత్యుత్పత్తి అతి శీఘ్రముగా తగ్గుట వలన కలుగు పరిణామములు నేర్చుకొందురు. జనాభా సమస్య విశదముగా చదివినప్పుడు మానవ ప్రత్యుత్పత్తి ఒక ప్రక్క అభివృద్ధి చెందిన దేశములలో తగ్గినను, ప్రపంచ జనాభా అతి శీఘ్రముగా అనగా 35 సంవత్సరముల లోపుగా రెండింతలు కానున్నట్లు తెలిసినది. కావున జనాభా సమస్య ప్రపంచమంతటికీ సమస్యే.

## జనాభా విద్యయొక్క ముఖ్యోద్దేశ్యములు

ప్రపంచ మంతట జనాభాకు సంబంధించిన సాధారణ సమస్యలు మరియు జనాభా విద్య ప్రత్యేకత గురించి పట్టింపు వున్ననూ జనాభా విద్యకు నిర్వచనము ఎచ్చటనూ లేదు.

జనాభా విద్య యొక్క ముఖ్యోద్దేశ్యమేమనగా యువతాంతరము వయస్సునుబట్టి, సాంఘిక పరిసరాలను బట్టి, ఆధునిక జనాభా పెరుగుదల వ్యవస్థ, దాని పరిణామములను గూర్చి తెలుపుట. ఈ జ్ఞానమును యవ్వన వయస్కులు సరియగు విధానమున ప్రవర్తించుదురని నమ్మకము. ఈ జ్ఞానము, యవ్వన వయస్కులు సరియగు తరుణమునందు ఉపయోగించుకొని సరియగు విధానమున ప్రవర్తించుదురని నమ్మకర. ఈ జ్ఞానమునకరియైన ఆలోచన చేయుటకు సరియైన నిర్ణయము తీసుకొనుటకు, సరియైన ప్రవర్తనకలిగి యుండుటకు తోడ్పడి మానవులకు సంఘమునకు దేశమంతట సుఖ సంతోషాలు మెరుగైన జీవితాన్ని అందిస్తుందని ఆశ.

## నిర్వచనము మరియు విస్తరణము

1970లో UNESCO జనాభా విద్యకు నిర్వచనము ఈ విధముగా తెలిపినది. "జనాభా విద్య ప్రపంచమునందు దేశమునందు సంఘమునందు మరియు కుటుంబమునందు జనాభా వ్యవస్థను గూర్చి తెలుపు విద్యా కార్యక్రమమని, యిందు మూలముగా విద్యార్థులయందు విచక్షణ, బాధ్యతతో కూడిన ప్రవర్తన కలిగి, వారు జనాభా సమస్యను ఎదుర్కొందురని నమ్మకము".

జనాభా విద్య ఒక విద్యా కార్యక్రమము. ఇది ప్రచారముకాదు. వైద్యశాలలతో ఆశులు జరిపే కుటుంబ నియంత్రణ కాదు. రెండవదిగా జనాభా విద్య చిన్న స్థాయిలోను పెద్దస్థాయిలోను ఒక సంవత్సరములో జనాభాలోని మార్పులు తెలుపుము. మూడవదిగా జనాభా పెరుగుదల లేక తరుగుదలకు, ఆర్థిక పెరుగుదలకు మనకుగల సహజ వనరులకు సంబంధమును గూర్చి తెలుపును. నాల్గవదిగా పై తెలిపిన విషయాలపై ఆధారపడి విచక్షణ జ్ఞానముతో యువకులు తమ జీవితాలకు సంబంధించిన విషయములయందు అనగా ఎప్పుడు వివాహమా చేసుకొనుట, ఎంత మంది సంతానమును పొందుట, యితర అవసరముల యంధు తగు నిర్ణయము తీసుకొనుటను తెలుపును. ఒక్కొక్కప్పుడు అవసరాలు సహజ వనరులకన్నా హెచ్చుగా వుండవచ్చును. ఉదాహరణముగా **U. S. A.** ప్రపంచ జనాభాలో 16 శాతం కలిగి 40 శాతం ప్రపంచ వనరులను వాడుకొనుచున్నది. కావున సగటున ఒక అమెరికన్ 25 సార్లు ఇండియన్‌కన్నా ఎక్కువ వనరులను ఉపయోగించుకొనును. అందువలన అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఎక్కువ జనాభా, పేదరికము, అశుభ్రమైన పరిసరములు. అనారోగ్యము మొదలగు సమస్యలు గలవు. అభివృద్ధి చెందిన దేశాలలో అవసరాలు మెండు, కాలుష్యము ప్రత్యుత్పత్తి తగ్గిపోవుట మొదలగు సమస్యలు గలవు.

జనాభా విద్య ప్రత్యేకముగా 12 సం॥ 25 సం॥ల లోపుగల యువతరానికి అవసరము. జనాభా విద్య విద్యా కార్యక్రమముగా పాఠశాలలయందు విశ్వవిద్యాలయాలయందు మొదలు పెట్టబడినది. కాని మన దేశములో ఎంతో మంది పాఠశాల కెళ్ళుటకు నోచుకోని వారు. వెళ్ళి కొంత కాలము తరువాత నిలిచిపోయినవారు వున్నారు. కాని మనదేశ పరిస్థితినిబట్టి జనాభా విద్య అమలు జరుపుటలో మార్పులు అవసరము. ప్రస్తుతము జనాభా విద్యను పాఠశాలలలోను విశ్వవిద్యాలయాలలోనేగాక యింటి యందే వుంటున్న యువతరానికి కూడా బోధించవలెనన్న విషయానికి ఎక్కువ ప్రాధాన్యత ఇయ్యవలెను. చదువులకు నోచుకోని వారు చిన్న వయస్సులో పెళ్ళిళ్ళు చేసుకొందురు. కాన చదువుకు వెళ్ళని యువతరానికి వయస్సును బట్టి అవసరాలను బట్టి జనాభా విద్యా బోధించడం అవసరము. కావున జనాభావిద్య బోధించుటలో ప్రేక్షకులను బట్టి కార్యక్రమమును నిర్వహించవలసి వుంటుంది.

## జనాభా విద్య యందలి అంశములు

1. జనాభా యందలి మార్పులు (Population Dynamics) .
2. జనాభా పెరుగుదల మరియు ఆర్థిక అభివృద్ధి.
3. జనాభా పెరుగుదల మరియు సాంఘిక, సాంస్కృతిక విషయము.
4. జనాభా, కుటుంబ జీవనము, మరియు లైంగిక విద్య.
5. ఆరోగ్యము, పోషక అహారము, సంఘసేవ మరియు జీవన విధానమునకు సంబంధించిన జనాభా సమస్య.
6. జనాభా పెరుగుదల - పరిసరములు. (Population growth and Environmental & Ecological Aspects) .

జనాభా విద్యకార్యక్రమాలు పై తెలపిన 6 అంశములతో రూపొందించవలెను. విశ్వ విద్యాలయము నందలి విద్యార్థులకు ఆరు అంశములపై ప్రాముఖ్యత చూప వలెను. కాని చదువుకు వెళ్ళని యువతరానికి జనాభా యందలి మార్పులు అన్ని అంశములలో మరణములు, జననములు, వివాహములు మరియు వలసలు మాత్రమే తెలుపవలెను. ఇందులో వారి సమాజము, ఊరు దేశము మరియు ప్రపంచమును గూర్చి కూడా తెలుపవచ్చును. అదే విధముగా చదువుకు వెళ్ళని వారికి పరిశుభ్రత, ఆరోగ్యము పెంపొందించుట, కుటుంబ జీవనము మరియు వీటికి సంబంధించిన విషయములు ఎక్కువగా చెప్పవలెను. చదువుకు వెళ్ళు వారికి, వెళ్ళని వారికి కూడా స్త్రీ పురుష ప్రత్యుత్పత్తి మండలమును గూర్చి తెలుపవలెను. ఇదే విధముగా పల్లెటూరు యువతరానికి పట్నవాసపు యువతరానికి, ఆడపిల్లలకు మొగ పిల్లలకు విద్య బోధించునపుడు ఇద్దరికి కలిపి కొన్ని విషయములు, వేరు వేరుగా మరికొన్ని విషయములు బోధించవలసి వుంటుంది.

## ముగింపు

వందలాది సంవత్సరములుగా శరవేగముతో పెరుగుతున్న జనాభా వ్యవస్థ గత 40 సంవత్సరములలో ప్రమాద పరిస్థితికి చేరుకున్నది. ఈ పరిస్థితికి కారణము శీఘ్రముగా తగ్గించబడ్డ మరణముల రేటు మరియు యధావిధిగా వున్న జననముల రేటు. వైద్య, సామాన్య శాస్త్రములయందు మరియు టెక్నాలజీలో అభివృద్ధి చెందుటవలన ప్లేగు, మశూచి, క్షయ మొదలగు భయం

కర రోగములను అరికట్టగలిగినారు. కాని నేటి ఆధునిక మానవుడు తన బ్రతుకు తెరువు కోసం జనాభా పెరుగుదలను అరికట్టవలెను.

మన దేశములో దేశ వ్యాప్తంగా కుటుంబ నియంత్రణ కార్యక్రమమును మొదటి పంచవర్ష ప్రణాళికద్వారా అమలు పెట్టినప్పుడు ఫామిలీ ప్లానింగ్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా లాంటి స్వచ్ఛంద సేవా సంస్థలు పెద్ద ఎత్తున పాల్గొన్నవి. 1960లో కుటుంబ నియంత్రణ కార్యక్రమము ఒక్కటే జనాభా పెరుగుదలను అరికట్టలేదని ఎంచి విస్తరణ విద్యాపద్ధతితో కలిపి అమలు పెట్టిరి. అదే విధముగా అవివాహితులైన యువతరానికి కూడా జనాభా పెరుగుదల, చిన్న కుటుంబము మొదలగు విషయములు జనాభా విద్య ద్వారా నేర్పుట మంచిదని భావించిరి.

# వివాహం కేవలం పిల్లల కోసమేనా ?

మల్లాది సుబ్బమ్మ

వివాహం సహచర్యానికా, సంతానానికా, అండదండలకా, ఆత్మీయతకా, తోడునీడకా, అన్యోన్య అనురాగానికా అనేవి కొన్ని మౌలిక ప్రశ్నలుకాగా కేవలం ధర్మ నిరతి కోసమే అంటే మత సంరక్షణకు, వంశోద్ధరణకు, యజ్ఞ యాగాది క్రతునిర్వహణకు వివాహవ్యవస్థ ఏర్పడిందని మతసూత్రాలు నిర్దేశిస్తున్నాయి. శారీరకమయిన విధిని క్రమబద్ధంగా నిర్వర్తించటానికే పెళ్ళి అవసరమయిందని కొందరు వాదిస్తున్నారు. అంతేకాదు మానవజీవితంలో సెక్సుకు ప్రథమస్థానం వుంది కనుక లైంగిక సంపర్కానికోసమే పెళ్ళితంతు ఏర్పడిందనే భావంకూడా ప్రబలంగానేవుంది. వంశోద్ధరణకు, పున్నామ నరక విముక్తికి పుత్రుడు పుట్టాలనే నమ్మకం ఇంకా ప్రబలంగావుంది. తమ ఆస్తి పాస్తులకు వారసుడు, తమను వృద్ధాప్యంలో కడతేర్చటానికి కుమారుడు కలగాలని తపస్సు చేస్తారు. మొక్కులు మొక్కుతారు. తమను ముఖ్యంగా ఉద్ధరించేందుకు బిడ్డలు లేకుంటే కృంగి కృశించి పోతారు ముఖ్యంగా సంతానాన్ని పొందలేని స్త్రీని, గొడ్రాలంటూ హీనాతి హీనంగా చూస్తారు. మాతృత్వాన్ని తెగపొగిడి హెచ్చు సంతానాన్నిపొందిన తల్లికి బహుమతులిచ్చి గౌరవించే ఆచారంకూడా ఇంకా కొన్ని సమాజాల్లోవుంది. అందువల్లనే స్త్రీ కేవలం సంతానాన్ని ఉత్పత్తి చేయటానికే ఉద్భవించిందనే భావం మన మస్తిష్కాలనిండా నిలిచిపోయింది.

అసలు పెళ్ళి ఎవరికోసం, ఎందుకోసం అంటే స్త్రీకి సంరక్షణకోసమని, సామాజిక శ్రేయస్సుకు, ఉనికికి అది అవసరమన్నారు కొందరు. మొత్తం మీద స్త్రీ బిడ్డలనుకని జాతినివృద్ధిచేయాలనే అభిలాష మానవజాతి ఆవిర్భావం నుండి వస్తున్న భావ పరంపర. అంతకుమించి మన పూర్వీకులు ఆలోచించలేకపొయ్యారు. వయస్సు పెరిగేకొద్దీ ఆలుమగల అనుబంధం పెరుగుతుందని, రెక్కలొచ్చిన పిల్లలు ఎగిరిపోతే ఆ ఒంటరిదశలో ఒండొరులకు మిగిలేది వారి సహచర్యమేనని మనకు తెలుసు. అందులో ఒంటరిగా బ్రతికేవారి బాధలు, వారిసమస్యలు మనకు కనిపిస్తూనేవుంటాయి. అయినా సంతానవాంఛ మిక్కుటం

గానే వుంటుంది. అది ప్రకృతిధర్మమా? వారసత్వ వాంఛాఫలితమా? సామాజిక అవసరమా? అనేవి కొన్ని ఆలోచనలు. ఏదైనా వివాహం సంతానం కోసమేనా? లేక తమకోసమా? అనేది ప్రస్తుత చర్చనీయాంశమయింది.

ప్రతికుటుంబంలో తల్లిదండ్రులు తమ పిల్లల పెళ్ళిళ్ళు చేయాలని తహ తహ లాడుతూ వుంటారు. ఆడపిల్లకయితే పెండ్లి విధిగా త్వరగా జరగాలని కోరుకుంటారు. కుమారునికికూడా పెండ్లి చేయటం అవసరమని భావిస్తారు. అంటే కాస్త ముందూ వెనుకా అన్నమాట. ఇది సర్వే సర్వత్రా కనిపిస్తుంది. భారత దేశంలో అన్ని మతాలవారూ అన్నితెగలవారూ ఈ భావాన్ని ఆదరిస్తు న్నారు. పాశ్చాత్య దేశాలలో తల్లిదండ్రులు తమపిల్లల జీవిత భాగస్వాములను ఎంపిక చేసేపనిని తాముగా పెట్టుకోకపోయినా తమ సంతానం వివాహితులు కావాలని అభిలషిస్తారు; ఆశిస్తారు. వైవాహిక జీవితం ప్రతివ్యక్తికీ అత్యంత అవసరమనీ, వైవాహిక దశ జీవితాన్ని సుసంపన్నమూ, సుఖవంతమూ చేస్తుం దనే విశ్వాసం ఈభావం వెనుక ప్రస్ఫుటంగా కనిపిస్తున్నది.

పెండ్లియొక్క పుట్టుపూర్వోత్తరాలను కూలంకషంగా పరిశోధించి సిద్ధాంతాలను రూపొందించిన మేధావులు ఎందరో ఉన్నారు. ఈనాటి వివాహ వ్యవస్థను పరిశీలిస్తున్న జిజ్ఞాసువులు కోకొల్లలుగా వున్నారు. వచ్చే శతాబ్దంలో పెండ్లి పద్ధతి ఏరూపాన్ని చెందుతుందో ఊహించే భవిష్యత్ కాలజ్ఞుల సంఖ్య పెరుగులానేఉంది. మానవసమాజ నిర్మాణంలో, పరిణామంలో వివాహం అత్యంత కీలకపాత్ర వహించినదని చెప్పటం అతిశయోక్తికాదు. పెండ్లియొక్క రూపం మారుతున్నది కాని పెండ్లియొక్క మౌలిక ప్రాతిపదిక మారినట్లు కన్పించదు. సాంగత్యాభిలాష స్త్రీ పురుషులు జంటగా జీవించటానికి దోహదం చేస్తుంది. ఆ సాంగత్యానికి కొంత శాశ్వతత్వం ఉంటే దానిని వివాహం అంటున్నాం. శాశ్వతత్వం అంటే జీవితకాలం ఉండేదని కాదు. తాత్కాలికం కానిదంతా శాశ్వతమైనదే.

పెండ్లి ఎందుకు? ఎవరికోసం? దేనిని ఆశించి పెండ్లాడాలి? ఇలాంటి నవాలక ప్రశ్నలకు సమాధానాలు రాబట్టుకోవాలంటే కొంత ఈ వ్యవస్థయొక్క ఆవిర్భావం, పెరుగుదల, పరిణామం, నేటిస్థితి, వీటిని గురించి కొంత ఆధార యుతమైన జ్ఞానాన్ని సంతరించుకోవాలి. జీవ పరిణామ శాస్త్రంతో పరిచయం వల్ల తెలిందేమంటే జీవులు పరిసరాలకు అనుగుణంగా తమను మార్చుకున్నాయని

మారగలిగిన జీవరాసులు బ్రతికాయి. లేనివి నశింపు అయినాయి. ఈ పరిణామంలో చివరకు మానవజాతి ఉద్భవించింది. ఇది ఒక్కసారిగా గాని లేక త్వరత్వరగా గాని జరిగిన మార్పుకాదు. కొన్ని లక్షల సంవత్సరాల మార్పు ఫలితం. ఏదైనా మానవజాతికి జంతు వారసత్వం ఉన్నదని రూఢి అయింది. ఆలోచనా శక్తి, పరిపక్వమైన భాష, పనిముట్లను తయారుచేసుకోగల నేర్పు, ప్రకృతిని తన అవసరాలకు అనుగుణంగా మార్చుకోగల సత్తా, ముందు తరాలకు తన సంస్కృతిని అందించగల అవకాశం ఇవన్నీ మానవజాతి ప్రత్యేకతలు. మానవ సమాజపు తొలి దశలో పెళ్ళిళ్ళు లేవు. కలయికలు, విడిపోవటాలు ఉండేవి. స్వైరవిహారం సాగేది. తెగలుగా జీవిస్తున్న ఆ కాలంలో ఇలాంటి జీవిత సరళి తగాదాలకు దారితీస్తుందనే భావం పుట్టింది. తరువాత జంట పెళ్ళిళ్ళు వచ్చాయి. అవి గుంపులోనే జరిగేవి. ఆ తరువాత నిషేధాలు రంగంలోకి వచ్చాయి. తల్లిని వివాహమాడరాదని, చెల్లెలును పెళ్ళాడరాదని ఇలాంటి ఆంక్షలు అమలు జరిపింది సమాజం. మరో గుంపులోని స్త్రీలతో లేక పురుషులతో జత కట్టాలని నియమాలు ఏర్పడినాయి. రక్త సంబంధీకుల మధ్య సంబంధాలకు అవాంతరాలు. అభ్యంతరాలు పెరిగాయి. ఎక్కువగా బహు భార్యాత్వం, కొన్ని సమాజాలలో బహు భర్తృత్వం అమలులోకి రావటం జరిగింది. చివరకు ఏక పత్నీత్వ, ఏక భర్తృత్వ వివాహాలు అధిక సంఖ్యాకుల ఆమోదాన్ని పొందాయి దీనిని పరిశీలిస్తే ఒక అంశం ప్రాధానంగా కన్పిస్తుంది. అదే స్త్రీ పురుష లైంగిక సాంగత్యపు అవసరం. దీనిని క్రమబద్ధం చేయటంలో, దీనిని నియంత్రణం చేయటంలో పెండ్లి పద్ధతి పుట్టింది. పరిణామం చెందింది.

ఈనాటి సమాజాన్ని నాగరిక సమాజంగా పిలుచుకుంటున్నాం. పూర్వపు విలువలు కొన్నింటిపై ఆదరణ తగ్గుతున్నది. కొన్ని విలువలకు ప్రాధాన్యత వస్తున్నది. ఇది దేశ కాల పాత్రలపై ఆధారపడి జరిగే మార్పు. దీనిని గమనించటం తప్పనిసరిగా జరగాలి. ఇక ఈనాటి సంగతి వంటచేసి పెట్టడానికి, ఇల్లు గడపడానికి, తనకు సంతానాన్ని ప్రసాదించడానికి, తోడు నీడకోసం పురుషులు పెళ్ళాడుతున్నారు. ఒక్కొక్కరికి ఒక్కొక్క కోరికపై మక్కువ ఎక్కువ. అలాగే తమ భద్రత కోసం, తమ ఆర్థిక సుస్థిరత్వం కోసం, సంతాన వాంఛ తీర్చుకునే నిమిత్తం, అంతఃపండల కొరకు స్త్రీలు వివాహాలు చేసుకుంటున్నారు. కాగా ఒక్కొక్క స్త్రీ ఒకానొక అంశానికి ఎక్కువ

ప్రాముఖ్యతను ఇవ్వవచ్చును. కాని ఒక్క ముఖ్యాంశాన్ని మనం గుర్తించాలి. స్త్రీ పురుషులు ప్రస్ఫుటంగా చెప్పక పోయినా అందరి మనస్సులలో ఉన్నది, ఉండేది ఒకే అంశం. అదే సెక్సుకు సంబంధించిన విషయం. ఒకరు మరొకరి లైంగిక సాన్నిహిత్యాన్ని ఆశించడమే అది. కాకపోతే సమాజం ఆమోదించిన రీతుల్లో మాత్రమే - బహుసంఖ్యాకుల పరంగా చెప్పుకుంటే - దానిని పొందాలని ఆశించడం జరుగుతున్నది. అయితే అందరూ సుఖప్రదమైన జీవితాన్నే కోరుకుంటారు. ప్రేమలేని సెక్సు జీవితం పశుప్రాయం. కోరతగినది కాదు. ప్రేమలేని వైవాహిక జీవితం మోడువారిన చెట్టు లాంటిది. పరస్పర అనురాగం, సానుభూతి, కష్ట సుఖాలను, కలిమి లేములను కలసి పంచుకోవడం ప్రేమయొక్క లక్షణాలు. ఇక్కడ ఒక అంశాన్ని విస్మరించరాదు. సెక్సులేని వైవాహిక జీవితం అసంపూర్ణం; అసమగ్రం. ఈ సత్యాన్ని మరచిన నాడు సామాజిక వ్యవస్థను గురించిన అవగాహన లోప భూయిష్టమవుతుంది.

ఆలు మగలతో కుటుంబం ఏర్పడుతుంది. వారు మాత్రమే కలసి ఉంటుంటే దానిని అణు కుటుంబమని పిలుస్తున్నాం. అత్తమామలతో, మరదులతో, ఆడుబిడ్డలతో కలసి కాపురం చేస్తుంటే దానిని సమిష్టి కుటుంబం అని అంటున్నాం. దేశం పారిశ్రామికీకరణం అవుతూ, జనం నగరాలకు ఎగబ్రాకుతున్నప్పుడు సమిష్టి కుటుంబాల సంఖ్య తగ్గిపోతున్నది. సమిష్టి కుటుంబాలలో సహజంగా ఉండే అత్త, ఆడుబిడ్డల ఆరళ్ళు తగ్గినా, కోడళ్ళకు భద్రత తగ్గుతున్నది. ఇది మంచి సమిష్టి కుటుంబాల సంగతి. చెడ్డవాటి సంగతి ముచ్చటించుకో నవసరం లేదు. ఈనాటిసమాజంలో కుటుంబ జీవితం కేవలం భద్రత కోసమే ననే వాదన వీగి పోతున్నది.

ఒకనాడు తెగలు తమలో తాము కలహించుకుంటున్నప్పుడు, ఉదాహరణకు వేదకాలంలో, యుద్ధాలు తరుచుగా జరిగేవి. శూరులు స్వజాతి సంరక్షణార్థం కావలసి వచ్చారు. దాంతో సంతాన సాధనకు ప్రాముఖ్యత ఏర్పడింది. సుపుత్రా ప్రాప్తిరస్తు, 'శీఘ్రమేవ సంతాన ప్రాప్తిరస్తు', 'పది మంది పిల్లల్ని కని కలకాలం వర్ధిల్లు' అనే దీవనలు వెలిశాయి. వంశోద్ధరణకు విలువ హెచ్చింది. మగ పిల్లలు కావాలనే కోర్కె ఋగ్వేద కాలపు చివరలోనే మొదలయింది. క్రమంగా పురుష సంతానంకోసం విధవరాలు నియోగానికి అంగీకరించవలసిన దుఃస్థితి కలిగింది. "సంతానం దైవదత్తం కనుక దానిని

వద్దన రాదు" అనే భావం కూడా మరోవైపున బలపడింది. స్త్రీ పురుష సంయోగ ఫలితంగా సంతానం కలుగుతుందని తెలియని రోజుల్లో కలిగిన భావాలు ఈ నాటికీ మనుష్యుల మనస్సులలో స్థిరంగా నాటుకొని ఉన్నాయి. ప్రభుత్వాలూ, రాజ్యాలూ పౌరుల పోషణ బాధ్యతను స్వీకరించని కాలంలో తమతో ఉండే మగ సంతానం మీద తల్లిదండ్రులు ఆధారపడుతున్నారు. ఇలా అనేక కారణాల వల్ల వైవాహిక జీవితంలో మగ పిల్లల పుట్టుకను అభిలషించడం జరిగింది. అది ఈనాటికీ కొనసాగుతున్నది.

పరిస్థితులు మారాయి. కాలం మారుతోంది. ప్రభుత్వాలు, స్వచ్ఛంద సంస్థలు పౌరునికి సాయపడటానికి ప్రయత్నిస్తున్నాయి. పౌరుల వైఖరి కూడా మార్పుకు లోనవుతున్నది. తమ వృద్ధాప్యంలో తాము ఇతరుల మీద ఆధారపడరాదనే భావం ప్రజలలో వ్యాపిస్తున్నది. అనారోగ్యవంతులు, విద్యావిహీనులు అయిన పలువురు సంతానం కన్నా ఆరోగ్యవంతులు, విద్యావంతులు అయిన కొద్దిమంది పిల్లలు చాలును అనే అభిప్రాయం పుంజుకుంటున్నది. స్త్రీలకు ఉద్యోగావకాశాలు మెరుగయి, అనేకమంది స్త్రీలు ఉద్యోగాలు చేయటానికి సంసిద్ధం అవటంతో మధ్యతరగతి కుటుంబాలలో ఇన్నాళ్ళూ వున్న స్త్రీ సంతానం యెడ విముఖత తగ్గిపోతున్నది. అన్నిటికన్నా ముఖ్యం తల్లి ఆరోగ్యం పట్ల శ్రద్ధాసక్తులు పెరుగుతున్నాయి. గుణవంతులయిన ఒకరిద్దరు పిల్లలు ఉంటే చాలుననే మాట తరుచుగా వినవస్తున్నది. ఇవన్నీగాక బ్రతికినన్నాళ్ళు సుఖంగా బ్రతకాలనే అపేక్ష స్త్రీ పురుషులలో పెరుగుతున్నది. దాంతో పరిమిత సంతానం యెడ దంపతులు సుముఖులవుతున్నారు. సంతానం కోసం వివాహం అనే భావం యొక్క పట్టు సడలిపోతున్నది. సాహచర్యం వివాహంలో ప్రముఖమైన అంశంగా రూపొందుతున్నది. సతి పతి యొక్క సహధర్మచారిణి అనే ప్రవచనంలోని ధర్మంపైనున్న నొక్కును గ్రహిస్తున్నారు స్త్రీలు. ధర్మం యొక్క ప్రాశస్త్యాన్ని గుర్తిస్తున్నారు. ధర్మం అంటే ఆనాటి అర్థం వేరు. ఈనాటి భావన వేరు.

ధర్మంఅంటే ఆనాడు స్వధర్మంఅని, అంటే కులధర్మం అని, స్త్రీలకు పతివ్రతా ధర్మం అని చెప్పుకునేవారు. సామాజిక శ్రేయస్సుకు వ్యక్తిస్వేచ్ఛకు అవకాశంఇచ్చి పొంతన కలిగించేది ధర్మమని ఈనాటి ఆలోచనా ధోరణి.

స్వేచ్ఛ, వ్యక్తివికాసం, మానవత, తోటివారియెడ సానుభూతి, సంతానంయెడ వాత్సల్యం, ఆలుమగల మధ్య అనురాగం, సహనం, పరస్పర గౌరవం, తన జీవితానికి తాను బాధ్యత వహించడం, సహకారభావం ఇవన్నీ ఈనాడు మనము నొక్కిచెబుతున్న విలువలు. మానవ సమాజంలో కొన్ని విలువలు శాశ్వతమైనవి. అవి ఏనాడూ మారవు. కాగా వాటి బహిర్గతరూపాలు విభిన్న కాలాల్లో వేరుగా ఉండటం చూస్తున్నాం. కుటుంబం యొక్క రూపం మార్పుచెందవచ్చు. కాని దాని మౌలిక స్వభావం మార్పుచెందదు. కుటుంబం సమాజంయొక్క ప్రాథమిక 'యూనిట్'. కుటుంబంలో పైచెప్పిన విలువల ఆదరణ, ఆచరణ రూపాన్ని సంతరించుకుంటాయి. పైన ఉటంకించబడిన క్రమంలో కుటుంబం యొక్క ఉద్దేశం ప్రదర్శితమవుతుంది. వివాహ బంధం కుటుంబ స్థాపనకు పునాది అని మనం గుర్తుంచుకుంటే వివాహంయొక్క పరమ ప్రయోజనం ద్యోతక మవుతుంది. ఆలుమగల వ్యక్తి వికాసానికి దోహదం చేస్తేనే వివాహ బంధానికి పవిత్రత, గౌరవమూ కలుగుతాయి. సంతాన ప్రాప్తికూడా ఆ బంధానికి బలాన్నీ, శక్తినీ, సంతుష్టినీ, తుష్టినీ ఇవ్వడానికే. వైవాహిక జీవితాన్ని సుఖప్రదమూ, సుసంపన్నమూ, పరిపూర్ణమూ చేయక, దానిని దుఃఖభాజనంచేసే అపవిత్ర సంతాన లబ్ధియెడ వాంఛ ఆశించ తగినదికాదు ఈ మాటలువిని సంతానంయెడ వైముఖ్యాన్ని ప్రబోధిస్తున్నారని ఎవరూ భ్రమ పడనవసరంలేదు. కేవలం సంతానంకోసమే వివాహం అనే భావానికి ఈనాడు ఆదరణ లభించరాదని చెప్పటమే మన ధ్యేయం కావాలి.

పెండ్లి అక్కరలేదని వాదించేవారు ఉండవచ్చును. కాని వారు కూడ పెండ్లి యొక్క మౌలిక లక్షణాన్ని కాదనటం లేదు. అదే సాహచర్యం, సన్నిహితత్వం, సహకారభావం, ధర్మానుసరణాసక్తి, స్వేచ్ఛా పిపాస. ఈ అంశాన్ని మనం గుర్తించిన నాడు 'పిల్లలకోసమే పెళ్ళి' అనే నినాదం అనాదరణీయం అవుతుంది. పెళ్ళి అనేది మానవ జీవితంలో కీలకపాత్ర వహిస్తే సంతానం అందులో ఒక చిన్న అంశం మాత్రమే అవుతుంది.

పెళ్ళి విశాల పరిధి కలది. అయితే సంతానం అందులో ఒక అణువు మాత్రమే అవుతుందని మనకు తెలుసు. కొన్ని సందర్భాలలో పిల్లలు అవాంఛనీయం కూడా కావచ్చు. అంటే దంపతుల లైంగిక జీవిత కాలమంతా కంటూ

వుంటే ఈ సువిశాల విశ్వం చాలదు. ఏ సుఖ సంతోషాలను ఆశించి పెళ్ళాడు తామో, ఆ పెళ్ళి దుఃఖభాజన మవుతుంది.

వివాహం దంపతుల జీవితంలో పెనవేసుకొని ముడిపడివుంటుంది. అది జీవితాంతం అనుభవించే అన్యోన్యఅనుబంధం. ఈ వైవాహికబంధం వయస్సుతో పాటు నానాటికీ పెరుగుతుంది. కాని దానికి తరుగుదలలేదు. కాని బిడ్డలుమాత్రం మధ్యలో వస్తారు. మధ్యలో వేరయిపోతారు. ఆ అనుబంధం కేవలం ఒక తీయని కలగా మాత్రమే మిగిలిపోతుంది బిడ్డలు పెరిగాక మంచి స్నేహితులుగా మారిపోతాం. అది ఉత్తమమని గాంధీకూడా హితవుచెప్పాడు. అందువల్లే "అడ్డాలనాడు బిడ్డలుగాని గడ్డాలనాడు బిడ్డలు కారు" అనే సామెత పుట్టింది. క్రిమేపీ తగ్గేది తల్లీబిడ్డల అనుబంధమయితే క్రమేపీ పెరిగేది భార్యాభర్తల అనుబంధ మనేది నగ్నసత్యం. ఇది నిత్యసత్యం; విస్మరించరాని పచ్చినిజం. అందువల్ల ఏదృష్టితో చూచినా పెళ్ళి పిల్లలకోసం కాదని రూఢి అవుతుంది. ఇది సర్వులకూ, సర్వకాలం వర్తించే చేదునిజం అనక తప్పదు.



# ముగ్గురి సోదరులలో ఇద్దరికే పెళ్ళి!

జనాభాపెరుగుదలను అరికట్టి, దేశసౌభాగ్యానికి తోడ్పడాలనే ఆవేదనతో అనుచిత సలహాలిచ్చినవారిలో అగ్రతాంబూలం మన వినోబా భావేది. ఆయన కొన్నాళ్ళక్రితం ఇచ్చిన సలహాలలో అమోఘమైనవీ ఆచరణ సాధ్యంకానివీ కొన్నివున్నాయి. అవి ప్రతివ్యక్తి 25 సం॥ నిండనిదే వివాహమాడరాదనేది ఒకటి. అయితే 45సం॥ నిండిన వ్యక్తి విధిగా వానప్రస్తాన్ని స్వీకరించాలనేది మరొకటి. ఇంతకన్నా ఘనమైనది మరోటి వుంది. ప్రతిముగ్గురి సోదరులలో ఒకడు ఆజన్మ బ్రహ్మచర్యం వహించాలని ఉద్ఘాటించడం.

వివాహ వయోపరిమితి పెంచమనడం భావ్యం కావచ్చు. కాని ఆ ఆంక్ష వల్ల వ్యక్తిగతాభిరుచినిబట్టి వివాహమాడే హక్కుకు భంగం రావచ్చు. భారత దేశంలో జీవితపరిమితి ఎంతపెరిగినా 56 సం॥ కంటేలేదు. అందువల్ల మేజరులైన తర్వాత వారి అభిరుచినిబట్టి వివాహమాడి ఒక్కరో, ఇద్దరో పిల్లలు పుట్టాక జన్మనిగ్రహాన్ని పాటించడం ఆచరణ యోగ్యమని ఆధునికుల అభిప్రాయం. అలాంటిదే వానప్రస్త స్వీకరణ. 45 ఏళ్ళు నిండాక దాంపత్య జీవిత విసర్జన అసాధ్యం కావచ్చు. కొందరు ప్రముఖులు జన్మనిగ్రహానికి వ్యతిరేకులమని చెప్పారు. కాని ప్రకృతిసహజమైన పద్ధతులను అనుసరించాలంటారు. జన్మనిగ్రహంవల్ల జనసంఖ్య తగ్గటమే కాక ఆత్మ సంయమనం కూడా కల్గుతుందని గాంధీజీ సందేశం. మొదటిసంతానం ధర్మజుడట. తర్వాత కల్గేవారు కామజులట! అందువల్ల కామాన్ని జయించాలట. దానికి బ్రహ్మచర్యమే మార్గమని గాంధీజీ ప్రవచించారు. జన్మనిగ్రహ సాధనాలు వాడరాదు. ఒక బిడ్డ పుట్టగానే దాంపత్యజీవితానికి "గుడ్‌బై" చెప్పాలని గాంధీజీ సందేశం. మరి ఈబిడ్డ 18ఏళ్ళకే పుట్టినప్పుడా! శేష జీవితమంతా బ్రహ్మచారిగా వుండేదానికి అసలు పెళ్ళెందుకు? అంటే 'తప్పు తప్పు' అంటారు. రామకృష్ణ పరమహంస పెళ్ళాడిన భార్యను తల్లిగా చూచేవాడట. ఈ దేశనాయకులుకూడా మతప్రవక్తలకు తీసిపోరు. మానవ సంక్షేమానికి ఇచ్చేసలహాలు, సందేశాలు ఆచరణ యోగ్యమైనవిగా వుండాలి. శాసనాలుకాని, ఆచారాలుకాని, మతసిద్ధాంతాలుకాని వ్యక్తి స్వేచ్ఛకు, సౌభాగ్యానికి మానసికతృప్తికి అడ్డంకులుకారాదు. ఆహార

నిద్రా మైథునాలు మానవ జీవిత ముఖ్య ధర్మాలు. అవి లేనివారికి సంపూర్ణత్వం లేదు. యోగిగా బైరాగిగా వ్యవహరించినా, లోలోపల విఫలమనోరథులవుతారు. బ్రహ్మచర్యం అందరికీ సాధ్యంకాదు. సర్వశక్తులూ వినియోగించి నిగ్రహించుకున్నా అది విషపరిణామాలకు, క్లిష్టమైన మానసిక అనారోగ్యాలకు దారి తీయవచ్చు. అంతమాత్రాన సర్వజ్ఞుడై ఏదో పరిపూర్ణ మానవుడు అవుతాడనుకోవడం కూడా భ్రమే. శరీరధర్మాలను సీమార్గాన పరిమిత రీతుల్లో నిర్వర్తించుట నేరంకాదు. బ్రహ్మచారి అయిన భావే, కోర్కెలుడిగిన గాంధీలకు దాంపత్యజీవిత రహస్యాలు, ఆ సమస్యలు అవగాహింపుకావు. ఇలాంటి సూచనల ద్వారా ఇతరులపై ప్రయోగాలు చేయడం న్యాయంకాదు.

వినోబా అద్వితీయ ఆలోచనలలో వారికి స్ఫురించిన మరొక ఆలోచన గమనార్హం ముగ్గురి సోదరులతో ఒకరు ఆజన్మ బ్రహ్మచారిగా వుండాలనేదే అది. వాడెవడు ? మొదటి వాడా ? చివరి వాడా ? లేక మధ్యముడా ? వారే సెలవివ్వాల్సింది. పూర్వం బకాసురుడు రోజూ యింటికొక వ్యక్తి చొప్పున ఆరగించేవాడట. ఒక దంపతులకు ముగ్గురు పిల్లలున్నారు. ఆ రోజు వారి ఇంటి వంతు వచ్చినప్పుడు తండ్రి తనకు పెద్దకొడుకు తర్పణం ఇవ్వాలి కనుక వాణ్ణి పంపనన్నాడు. తల్లి తనకు చిన్న బిడ్డపై మక్కువ వున్నందున వీలు కాదన్నది. మరి ఇంకేం చెయ్యాలో తోచక తల్లిదిల్లి పోయ్యాడు మధ్యముడు. అలావుంది ఈ ఆలోచన. మన ఆదేశాలు సందేశాలు మానవ సంక్షేమాన్ని సౌభాగ్యాన్ని ఇచ్చేవిగా వుండాలి. కాని, విషాద ఫలితాలను ఇచ్చేవిగా వుండరాదు. ప్రతివ్యక్తి వివాహమాడి ఉభయుల సమ్మతి మీద బిడ్డనుకన్నా, కనక పోయినా తప్పులేదు. అది వారి వ్యక్తి గత విషయం కావాలి కాని మత ప్రమేయం అక్కడ చోటు చేసుకోరాదు. వ్యక్తి మనుగడకు, సుఖ సంతోషాలకు. ప్రగతికి తగిన సందేశాలు మాత్రమే శ్రేయస్కర మవుతాయి.

-0-

# చిన్న కుటుంబ తత్వం

ఎం. వి. రామమూర్తి

చిన్న కుటుంబం అని వినపడగానే ఇదేదో నినాదమని భావిస్తారు కొందరు. ప్రభుత్వాలు, స్వచ్ఛంద సంస్థలూ చేపట్టే కార్యక్రమమని తల పోస్తారు మరి కొందరు. కొన్ని వర్గాలకు ఈ పదజాలం విషతుల్యం. ఇతర వర్గాలకు ఇది ఆశాజ్యోతి. ఇలా వివిధ శాఖలకు చెందిన ప్రజానీకం పలు రకాలుగా దీనిని పరిగణిస్తారు. అయితే ఇంతమంది ప్రజలను అనుకూలురు గానో లేక ప్రతికూలురుగానో తయారు చేస్తున్న ఈ ఆలోచన కేవలం యాదృచ్ఛికమా ? లేక దీని వెనుక ఏదో ప్రగాఢమైన తాత్విక చింతన ఉన్నదా ? ఇదే ప్రస్తుతం మనం పరిశీలించవలసిన అంశం.

మానవుడు హేతుశీలి; బుద్ధిజీవి జీవరాశిలో అతని ప్రత్యేకత ఇదే. కాగా అతని ఆలోచన గాలిలో పుట్టదు. అతడు ఒంటరిగా జీవించటం లేదు. సమాజంలో నడయాడుతున్నాడు. కనుక అతని చుట్టూ ఉన్న ప్రకృతితో, సమాజంతో సంపర్కం అతనికి తప్పనిసరి. ప్రకృతిని గురించి, సమాజాన్ని గురించి, తనను గురించి ఆలోచించటం అతని నైజం. తత్ఫలితంగా అతనిలో భావ ఆవిర్భావం జరుగుతుంది. అయితే అతనికి భావనా బలిమి కూడా ఉన్నది. అందువలన ప్రస్తుతమున్న స్థితిని గమనించి రాబొయ్యే స్థితిని ఊహిస్తాడు. భవిష్యత్తులో తను ఆశించే పరిస్థితిని సాధ్యం చేయడానికి ఉద్యమిస్తాడు. అందుకు అనువైన సాధనాలు అతనికి ఉన్నాయి. భాష అతనికి పనిముట్టు. తన మేధాశక్తితో యంత్రాలను సృష్టిస్తాడు. తన తరపు సంస్కృతిని ముందు తరాల వారికి అందజేస్తాడు. ఇలా అభ్యుదయ పథంలో మనిషి పయనిస్తాడు.

మనిషి పరిసరాలు అతని ఆలోచనను, ప్రభావితం చేస్తాయి. ఉదాహరణకు జనాభా చాల తక్కువగా ఉన్న రోజులలో నూతన దంపతులను ఆశీర్వదిస్తూ పదిమంది పిల్లలను కని కళకళలాడుతూ కాపురం చేయమని ఆశీర్వదించే వారు. ఇప్పుడు ప్రపంచం మొత్తం మీద జనాభా పెరిగి రద్దీ ఎక్కువయి

అనేక సమస్యలు ఉత్పన్న మవుతున్నప్పుడు వధూవరులను పరిమిత కుటుంబంతో పది కాలాలపాటు వర్ధిల్లమని దీవిస్తున్నారు. అయితే మనిషి కేవలం సామాజిక జీవితాన్ని ప్రతిఫలించే సామాజిక జీవి మాత్రమే కాదు. అతనికి ఇతరమైన వ్యక్తిత్వం కూడా ఉంది. ముందుచూపు ఉంది. కనుక ప్రతిదీ అతనికి అనుభవంలోకి వస్తేగాని స్పందించలేని స్థితిలో లేడు. ఇప్పటి స్థితిని బట్టి ముందుకాలపు స్థితిని ఊహించగల సత్తా అతని సొమ్ము. కనుక సంపన్నమయిన దేశంలో- అంటే ప్రకృతి వనరులు, ఆర్థిక వనరులు. ప్రజాశ్రేయస్సును కాంక్షించే సమాజమూ, దానికి అనుగుణమైన ప్రభుత్వమూ ఉన్న దేశంలో - దేశస్తులు కూడా చిన్న కుటుంబాన్ని ఆదర్శవంతంగా స్వీకరించ వలసిన అవసరాన్ని మానవుడు గుర్తించగలడు.

మనిషి ఆనందాన్ని కాంక్షించటం గమనిస్తున్నాం. తన అవసరాలను తీర్చుకోవటం ద్వారా ఆనందాన్ని పొందడం చూస్తున్నాం. మనిషి కున్న అవసరాలు పలురకాలు. ప్రకృతి శక్తులనుండి రక్షించుకోవటానికి అవసరమైనవి కొన్ని. ఇల్లు, ఉష్ణోగ్రతను పెంచేవి, శీతలీకరణ చేసే సాధనాలు, అలాంటివి. శారీరక అవసరాలు మరో రకం. తిండి, బట్ట. పరిశుభ్రమైన నీరు, కాలుష్యం లేని గాలి అలాంటివి. విద్య, జ్ఞానము సాంస్కృతిక పరమైనవి. అమితో ద్రేకాలకు లోను కానట్టి స్థితి, సమతుల్య భావన మానసికమైనవి. కళా దృష్టి, రసాస్వాదన చేయగల సత్తా మానవుడికి విశిష్టమైన లక్షణాలు. ప్రకృతిలోని కార్య కారణత అతనిలో హేతుత్వంగా ప్రభవిస్తే ప్రకృతిలోని సామరస్యం, పొందికలు అతనిలో కళాశక్తిగా భాసిస్తున్నాయి. మొదటిది అతనిని సత్యాన్వేషణకు పురికొల్పితే, రెండవది అతనిలో సృజనాత్మకతను రేకెత్తిస్తున్నది. అందుకే అతడు సత్యంకోసం అహరహం తపిస్తాడు, శ్రమిస్తాడు. సౌందర్యారాధన చేస్తాడు; సుందరరూపాలను సృష్టించ ప్రయత్నిస్తాడు. మానవుడు సామాజిక జీవి కనుక తనకూ సమాజానికి శుభప్రదమైన దానిని, మంగళప్రదమైన దానిని అపేక్షిస్తాడు. సత్యం, శివం, సుందరం అనే వాటిని ప్రామాణిక విలువలుగా ప్రాచీనులు పేర్కొనటంలోని అంతరార్థం ఇదే.

సత్యాన్వేషణకోసం మానవుడు నిరంతరం కృషి సాగిస్తూనే ఉన్నాడు. శాస్త్రజ్ఞులు అనుక్షణం సాగిస్తున్న ప్రక్రియ అకోవలోనిదే. అంతరిక్షాన్ని శోధించటానికి చేసే ప్రయత్నం అలాంటిదే. సముద్రంలోని గంభీరతను, మహోన్నత

పర్వతశ్రేణుల ఔన్నత్యాన్ని, మబ్బుల రంగు రంగుల పరదాల అందాన్ని, సెలయేళ్ళ ఉధృతాన్ని, నెమలిపింఛపు సోయగాన్ని, కోకిల మధురగానాన్ని చూచి, విని, తనివితీరా అనుభవించిన మనిషి నూతన సృష్టికి పూనుకుంటు న్నాడు. తనొక్కడే చేయలేని పనులు అనేకం ఉన్నాయని గ్రహించి తోటి వారలతో సహకరించటం నేర్చుకొన్నాడు; అలవరచుకున్నాడు. ఇలా తనూ ఇరుగూ పొరుగూ, తన దేశస్తులూ, ఇతరులూ అందరూ కలిస్తే మానవ సమాజం అవుతుందని గుర్తించాడు. కనుక సామాజిక శ్రేయస్సుకు ప్రాధాన్యత ఇవ్వడం కర్తవ్యమయింది. ఇలా మనిషి ముందుగా తనను, తన చుట్టూ ఉన్న సమాజాన్ని గమనించి తన అభివృద్ధిని, అభ్యుదయాన్ని, వికాసాన్ని కోరుతూ సామాజిక సంక్షేమం లేనిదే తనకు స్వేచ్ఛ, భద్రత, ఆనందం లభించవని తెలుసుకున్నాడు. ఇదంతా ఒక మంచి రోజున మానవ జాతి సమావేశమై నిర్ణ యించిన విషయం కాదు. వేల సంవత్సరాల జీవిత క్రమంలో పరిణామంలో ఉద్భ వించిన ఆలోచనా స్రవంతి.

ప్రతి మానవజీవి భౌతిక, శారీరక, మేధావిషయ, సామాజిక, ఆర్థిక రాజకీయ, సాంస్కృతిక బంధాలలో పుట్టున్నది; గిట్టున్నది. రాగా ఈ బంధాల నుండి విముక్తి కోసం ఆరాటపడుతున్నది. దానిని స్వేచ్ఛ అంటున్నాం. బంధంనుండి స్వేచ్ఛను పొందాలంటే బంధమేదో, ఎలాంటిదో తెలియాలి. అందుకు సత్యాన్వేషణ ఉపయుక్త మవుతుంది. సమాజంలోని తదితరులతో సహకరించి స్వేచ్ఛను పొందుతుంది. తోటివానిని సమానుడుగా చూడకపోతే తోటివాడు సహకరించడు. కనుక సమానత్వం తప్పనిసరి అవుతుంది. సమా నత్వ సిద్ధాంతాన్ని మరోరకంగా కూడా సమర్థించవచ్చును. తోటివాని సంక్షే మాన్ని, శ్రేయస్సును నేను కోరకపోతే, దానికోసం కృషి చేయకపోతే అతడూ లేక ఆమె నా బాగోగులను పట్టించుకోరుకదా ? ఇలా, స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం మౌలిక మానవ విలువలుగా అంగీకరించాల్సి వస్తున్నది.

ఇంతకూ చిన్న కుటుంబంలో జీవించే మానవవ్యక్తి ఈ విలువలను తన జీవిత ధ్యేయాలుగా చేసుకోవటానికి వాటిని తన జీవితంలో సాధ్యం చేసుకోవటానికి వీలు అవుతుందా ? లేకపోతే ఈ సిద్ధాంతచర్చ మనకు అనవసరంగా తోస్తుందికదా !

వ్యక్తి శ్రేయస్సుకూ, సామాజిక శ్రేయస్సుకూ వైరుధ్యం ఉండటానికి ఆస్కారం లేదని గ్రహించాము. వాతావరణ కాలుష్యం ధనికులనూ, పేదలనూ ఇద్దరినీ బాధిస్తున్నది. కాగా పేదలు ఎక్కువగా దెబ్బతింటారు. అభివృద్ధి చెందిన దేశాలవారూ, బడుగు దేశాలవారూ అందరూ కొన్ని వ్యాధులను తప్పించుకోలేరు. కాకపోతే బడుగుదేశాలవారికి తక్షణ తక్కువ. ఈస్థితిలో ఏ ఒక్క వ్యక్తీ, దేశమూ ఒంటెత్తు పోకడ పోజాలదు. స్వేచ్ఛ అపిఛాజ్యం. అణు యుద్ధమో అంతరిక్షయుద్ధమో వస్తే-రాకూడదు; రానీయరాదు-అనాడు మానవ జాతి చాలవరకు నాశనం కావటం తథ్యం. ధనవంతుడు, అధికారి, వనరులుగల వ్యక్తి, సుసంపన్న దేశపు పౌరుడు అందరూ దెబ్బ తింటారు. ఈ విషయం తెలిసి సద్వ్యక్తులు ముందుచూపుతో సామాజిక శ్రేయస్సును గురించి మాట్లాడతారు.

సమాజంయొక్క ఒక్కొక్కదశలో ఒక్కొక్క భావనకు ప్రాముఖ్యత వస్తుంది. మానవ జాతి ఛిన్నాభిన్నమై అనేక సముదాయాలుగా ఉన్నపుడు ఏ గుంపు కాగుంపు విడివిడిగా బ్రతికాయి. అపుడు సమిష్టి జీవితానికి ప్రాధాన్యత ఇచ్చాడు మానవుడు. ఈ దశలో వ్యక్తి దెబ్బ తింటున్నాడని గుర్తెరిగిన మేధావులు కొందరు వ్యక్తి స్వేచ్ఛ, వ్యక్తి వికాసం కావాలని గగ్గోలుపెట్టారు. సమాజ పునర్నిర్మాణం జరిగింది. వ్యక్తిస్వేచ్ఛ వెర్రితలలు వేసింది. దానిపేర బలవంతులు, ధనవంతులు, అధికారులు, పాలకులు తతిమ్మావారిని అణిచివేశారు. దాంతో సమాజానికి వ్యక్తి స్వేచ్ఛపై మొగం మొత్తింది. సమిష్టి శ్రేయస్సు కోసం వ్యక్తులు బలిదానం చేయాలనే భావన మరల తల ఎత్తింది. జాతిపేర, వర్గంపేర, దేశంపేర, భాషపేర, ప్రాంతంపేర సమిష్టి తత్వం ప్రబలింది. అదీ దుష్ఫలితాలకు దారితీసింది. మళ్ళీ వ్యక్తి వికాసానికి పెద్దపీట వేస్తున్నారు. అయితే ఈనాటి వ్యక్తిని సామాజిక వ్యక్తిగా నిర్వచనం చేశారు. ఇదీ సామాజిక ఉద్యమాల పరిణామం. కాగా సమాజంలో వర్గాలున్నాయి. ఇది వాస్తవం. దీనిని కాదనలేము. కనుక వ్యక్తిస్వేచ్ఛ, సామాజిక శ్రేయస్సు, ఈ రెంటినీ ఆయా వర్గ ప్రజానీకం తమ అవసరాలకు అనుగుణంగా అర్థం చేసుకుంటారు ఆయా కాలాన్నిబట్టి. చిన్న కుటుంబ ఉద్యమ సందర్భంగా ఇదే జరుగుతున్నది. 'సామాజిక శ్రేయస్సు దృష్ట్యా' 'చిన్నకుటుంబ' నినాదాన్ని ఇంతవరకు ఏవరింపటం జరిగింది. ఇకముందు వ్యక్తి వికాసం, వ్యక్తి అభ్యుదయం వీటిని మనసులో పెట్టుకొని, వీటిపై నొక్కిపెట్టి పురోగమించాలి.

సమాజంలో దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నవారి శాతం 37 అని కొంద రంటే 52 అని మరికొందరు అంటున్నారు. లెక్కల తేడాల గందరగోళం లోకి మనం పోకుండా స్థూలంగా 100కి 40 మంది సరియైన తిండికి, బట్టకు విద్యకు, ఆరోగ్యానికి, గృహవసతికి నోచుకోలేని స్థితిలో ఉన్నారని అంగీక రించ వచ్చును. ఈ వర్గానికి చెందినవారికి, అందులోనూ మరీ బీదవారికి సామాజిక శ్రేయస్సును గురించి ప్రబోధం చేస్తే వారు ఎలా స్వీకరిస్తారు? "సమాజం నాకు ఏం చేసింది? సమాజం కోసం నేను ఎందుకు తక్కువమంది సంతానాన్ని కనాలి? సమాజం ఇప్పుడు నా పిల్లలను పోషిస్తున్నది కనుకనా ఇకముందు నన్ను పిల్లలను పొందవద్దని చెప్పడానికి?" అని నిగ్గదీసి ఉద్యమ కార్యకర్తలను అడిగితే మనం ఏమి చెప్పగలం? వారి విషయంలో అన్వ యించేది మున్ముందుగా 'వ్యక్తి సంక్షేమం' అనే సూత్రం. ఇలా జవాబు చెప్పాల్సి ఉంటుంది. "సమాజం మునుపటి కన్నా కొంతవరకు పురోగ మించింది. కాని అది చాలదు. ఇంకా మార్పురావాలి. బ్రహ్మాండమైన మార్పు రావాలి. సమూలమైన మార్పురావాలి. దానికోసం మనం అందరం పని చేద్దాం. అనుకున్నవన్నీ వెంటనే సాధ్యం కావటంలేదు. అడ్డంకులు అనేకం. వాటిని తొలగించుకుంటూ పోవాలి. ఇది తొందరగా జరగవచ్చు. ఆలస్యం కావచ్చు. అదంతా మనమీదనే ఆధారపడుతుంది. ఏదైనా, ఒకవేళ ఆలస్య మయితే ఈ లోగా బాధపడేది నీవూ, నీబోటివారూ, నేనూ నాబోటివారూ. కనుక నీలాగా నీ భార్యా, నీ పిల్లలూ, లేక నీ భర్తా, నీ పిల్లలూ బాధపడని మార్గం అన్వేషించాలి కదా! అది నీ కోసం! నీ కుటుంబ సంక్షేమం, కోసం" ఈ సమా ధానం దర్రిద్రంలో మగ్గుతున్న ఆమెకుగాని అతనికిగాని కొంత తృప్తినిస్తుంది. కనీసం కోపకారణం కాదు; ఆలోచింప చేస్తుంది. ఇది ఎత్తుగడగా, వ్యూహంగా చెప్పేమాట కాదు. సూత్ర నిబద్ధమైన సిద్ధాంత విషయం. తనకు మాలిన ధర్మం లేదని కదా పెద్దల మాట. సాధారణంగా మానవులు తమ శ్రేయస్సునూ, సమా జం లోని తదితరుల శ్రేయస్సునూ కోరుతారు." నీ యోగక్షేమాల విషయం అక్కరలేదు. నీవు దేశం కోసం, సమాజం కోసం ఇలాచెయ్యి" అని సలహా చెప్తే లేక "అలా చేయాలి" అని ఆదేశిస్తే దుర్భర నికృష్ట జీవితం గడుపుతున్న మానవుడు ఎందుకు స్పందించాలి ఎలా స్పందించగలడు? వ్యక్తి స్వేచ్ఛను అపార్థం చేసుకొని సామాజిక శ్రేయస్సును నిర్లక్ష్యం చేసే వర్గాలకు సమిష్టి సంక్షేమాన్ని గురించి ప్రబోధం చేయటం యుక్తియుక్త మవుతుంది.

ఈ సందర్భంలో నీతిని గురించి ప్రస్తావించ వలసి యున్నది. మనిషి తోటి మనుష్యులతో ప్రవర్తించే విధానాన్ని మనం "నీతి" అని పిలుస్తున్నాం. ఇది వ్యక్తి పరమైన విషయం. సమాజం మొత్తం కొన్ని లక్షణాలతో, కొన్ని అలవాట్లతో, కొన్ని ఆచారాలతో మనుగడ సాగిస్తుంటుంది. దీనిని సాంఘిక నీతి అంటాము ఒక్కొక్కప్పుడు సామాజిక నీతికి, వ్యక్తిగత నీతికి వైరుధ్యం సంభవించవచ్చును. అయినా వ్యక్తియొక్క నడవడి తోటివానికి సమాజానికి నష్టం కలిగించనంత కాలం సామాజిక నీతికి భిన్నం అయినా అతడు లేక ఆమె తన అభీష్టానుసారంగా నడుచుకోవటానికి హక్కు ఉన్నది. ఉదాహరణకు ఒకానొక దశలో ఉన్న సమాజంలో దశ సంతానం కనడం సామాజిక నీతి అయినా ఒక కుటుంబం వారు పిల్లలను కనదలచక పోవటం, ఒకవేళ సంతానాన్ని పొందినా ఒకరిద్దరిని మాత్రమే కలిగి ఉండడం సామాజిక శ్రేయస్సుకు భంగకరం కానేరదు. వ్యక్తిగత నీతి ఇచ్చట సామాజిక నీతిని భంగపరచటం లేదు. కాగా సామాజిక నీతి పరిమిత సంతానాన్ని అభిలషిస్తుంటే వ్యక్తిగత స్వేచ్ఛ పేరుతో పదిమంది పిల్లలను కని వారి బరువు బాధ్యతలను సమాజంపై రుద్దడం సామాజిక నీతికి విరుద్ధమైనది.

మరొక అంశం పరిగణనలోకి తీసుకోవాలి. అదే మాటలకూ చేతలకూ వైరుధ్యం విషయం. కొంతమంది వ్యక్తిగతంగా పరిమిత కుటుంబాన్ని అభిమానించి తమది చేసుకుంటారు తమ మాట వినేవారిని, తమని గౌరవించే వారిని "మీ యిష్టం వచ్చినట్లు పిల్లలను కనండి" అని ప్రబోధిస్తారు. ఇది ద్వంద్వనీతి. మరో తెగవారున్నారు. వారు "పరిమిత కుటుంబం" అనే లక్ష్యాన్ని చేపట్టరు. కాని అది కావాలని పదిమందికీ చెప్తారు. ఇది కేవలం అవినీతి. తమకొక నీతి, పరాయి వారికి మరొక నీతి ప్రచారం చేయటం అన్యాయం, అక్రమం. సమాజం యొక్క నడవడిపై, విధానంపై అక్కసుతో మొదటివర్గం అలాచేస్తే, ఈ 'పరిమిత కుటుంబం' అనే విధానంపై విశ్వాసం లేక రెండవవర్గం ఇలా చేస్తున్నది. రెండూ పొరపాటు విధానాలే, ఈ రెండు ఉదాహరణలలోనూ సామాజిక నీతికి భంగకరమైన వ్యక్తిగత నైతిక దృక్పథాలు దర్శన మిస్తున్నాయి.

ప్రజాస్వామ్య దేశంలో సామాజిక నీతిని ప్రభుత్వం అమలు పరుస్తుంది. ఏ మేరకు ప్రభుత్వం సామాజిక నీతిని తన విధానంగా చేసుకుంటుందో ఆ

మేరకు అది ప్రజాస్వామికం అని అనిపించుకుంటుంది. సమాజాన్ని ముందుకు నడిపించే ప్రభుత్వాలూ ఉంటాయి. వెనుకకు నడిపించే ప్రభుత్వాలు ఉంటాయి. ఆ మాటకు వస్తే ప్రభుత్వాలు అన్ని విషయాలలోను మంచిపని చేయవు; అన్ని విషయాలలోను చెడ్డగా ఉండవు. ప్రపంచములో పూర్తిగా మంచి, పూర్తిగా చెడు అనేవి ఉండవు. పూర్తి నలుపు, పూర్తి తెలుపు ఉండవు. తరతమ భేదాలు ఉంటాయి. ఈ నలుపు తెలుపుల మధ్య ముబ్బురంగు, బూడిదరంగు, గోధుమ రంగు, చామనచాయ ఇలా ఎన్నో ఉంటాయి. పరిమిత కుటుంబం అనే ఉద్యమాన్ని ప్రభుత్వం చేపట్టింది. దాని ఫలితాలు పరిశీలిస్తే, సమాజానికి ఉపయోగకరం. కనుక సమాదరణీయం.

ప్రభుత్వం మీద ఆగ్రహంతో సమాజం మీద అసూయతో "పరిమిత కుటుంబ" కార్యక్రమం వెనుకన ఉన్న తాత్విక చింతనను, ఉద్యమాన్ని నిరసించటం పొరపాటు భావనగా ఎంచుకోవాలి.

'పరిమిత కుటుంబ' సాధనకు జన్మ నిగ్రహ విధానం అవలంబించక తప్పదు. కుటుంబ నియంత్రణ స్త్రీ స్వేచ్ఛకు దోహదం చేస్తుంది. స్త్రీ సంతానవతి కావాలా అక్కరలేదా అనే అంశాన్ని ఆమె సంకల్పానికి, ఇచ్ఛకు వదిలి చేస్తుంది. తద్వారా ఆమెను లైంగిక దాస్యం నుండి రక్షించింది. ఆమె తనను ఒక వ్యక్తిగా మలుచుకోనిచ్చింది, స్త్రీ పురుషులు కనిపెంచడం అనే నిరంతర వ్యాసంగం నుండి విముక్తులై ఇతోధిక విశ్రాంతిని సంపాదించుకొని విద్యా సంస్కృతులను అలవరచుకోవటానికి వారికి అవకాశం ఇస్తున్నది. అలాగే సామాజిక జీవితంలో పాలు పంచుకోడానికి స్త్రీలకు వీలు, వెసులుబాటు కలిగిస్తున్నది. వారి సంతానానికి ఆరోగ్యాన్ని, పుష్టిని, తుష్టిని, విద్యను, సంస్కారాన్ని కలుగ జేయటానికి ఉపకరిస్తున్నది. ఇలా మానవుని భౌతిక, శారీరక, మానసిక సాంస్కృతిక, అవసరాలను తీర్చుకోగల తాహతును పొందటానికి అతనికి, ఆమెకు సదుపాయం ఇస్తున్నది. సత్యాన్వేషణ, స్వేచ్ఛ, సృజనాత్మకత లాంటి మానవ ప్రేరకాలను అతని జీవితంలో రూఢి చేసుకోగల పరిస్థితి కల్పిస్తున్నది. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే మానవ విలువలను సుసాధ్యం చేస్తున్నది. మానవుడు తన ధ్యేయాలను, లక్ష్యాలను సాధించుకోవటానికి ఉన్న అడ్డంకులలో ఒక దానిని-విపరీత సంఖ్యలో ఉన్న సంతానపు బరువు బాధ్యతలన్ను-తొలగిస్తున్నది పరిమిత కుటుంబం."

# కుటుంబ నియంత్రణ : అపోహలు, అనుమానాలు

మల్లాది సుబ్బమ్మ

జననాలను నిరోధించాలనే ప్రయత్నాలు విరివిగా జరుగుతున్నాయి. అయినా గత ముప్ఫైఏళ్ళలో మనజనాభా 72 కోట్లు అంటే రెట్టింపుకు పైగా దాటింది. ఇంకా రెండు శాతం చొ॥ పెరుగుతూనే వుంది. మరో ముప్ఫై ఏళ్ళలో చైనా దేశ జనాభాకన్నా మనం పెరిగి ప్రపంచ రికార్డును స్థాపించ బోతున్నామా అనిపిస్తోంది. కారణం వారు "కంపల్సరీ స్టెరిలైజేషన్" నిర్దేశించారు "ఒకరు లేక అసలే వద్దు" అంటూ ఒక్క పిల్ల కన్నా కనరాదని శాసించారు. మనది ప్రజాస్వామిక దేశం అంటూ ఆ రూల్సును వ్యతిరేకిస్తున్నాం. అదీకాక మనకు బోలెడన్ని సంప్రదాయాలు, మూఢాచారాలు, మత సిద్ధాంతాలు ఆచరణలో వున్నాయి. అవి మన సంస్కరణోద్యమా లన్నింటిని వెన్నుపోటు పొడుస్తూనే వుంటాయి. అలాగే కుటుంబ నియంత్రణ విషయంలో కూడా ఎన్నో అనుమానాలు అపోహలు వున్నాయి. కనుక వాటి పుట్టు పూర్వోత్తరాలను, స్వరూప స్వభావాలను చర్చిస్తే తప్ప నివారణోపాయాలు స్ఫురించవు.

కుటుంబ నియంత్రణ అంటే జన్మ నిరోధమని, తద్వారా పుట్టుకలను నిరోధించటం మహా పాపమని, ఇది సృష్టి ధర్మానికే వ్యతిరేకమని, బిడ్డల్ని కనడం దైవవిధి అని, దాన్ని ఎదిరించిన వారికి ఉత్తమగతులు వుండవని కొందరు వాదిస్తున్నారు. కుటుంబ నియంత్రణ వలన జీవహింస, భ్రూణ హత్యల్లాంటి రౌరవాది నరకాల్లో పడిపోతామనే విశ్వాసం కొందరిలో వుంది. ఈ పద్ధతులను అనుసరిస్తే శారీరక, మానసిక వైపరీత్యాలు సంభవిస్తాయి అనే పరభిప్రాయం చాలా మందిలో వుంది. దీని వల్ల ప్రజలలో అపనేతి పెరుగుతుందనే బెదరింపులు కూడా మిక్కుటంగా వున్నాయి. కుటుంబ నియంత్రణ కేవలం సంస్కారులు మాత్రమే అనుసరిస్తున్నారని, అందువల్ల సంస్కారుల సంఖ్య తగ్గి, దుర్మార్గుల, కుచ్ఛితుల సంఖ్య పెరుగుతుందని తద్వారా ప్రజా స్వామ్య రాజ్యాంగానికే ముప్పు వాటిల్లే ప్రమాదం ముంచుకొస్తుందనే భయం

అనేక మందిలో వుంది. ఇంకా దేశరక్షణ కోసం జనాభాను పెంచుకోవాలని, వంశోద్ధరణకు, పున్నామ నరక విముక్తికి సుపుత్రుడు కావాలనే సిద్ధాంతాలు అనంతంగా వున్నాయి. ముఖ్యంగా కుటుంబ నియంత్రణ హిందువులు మాత్రమే ఆచరించడంవల్ల ముస్లిం జనాభా పెరిగి భారత దేశం రెండవ పాకిస్తాన్‌గా మారిపొయ్యే ప్రమాదం వుందని కొందరి ఊహ.

సృష్టి క్రమంలోనే మానవునికి తన ప్రధాన కోర్కెలైన ఆవాసము, ఆహారం పొందగల హక్కు పరిమితంగానే వుంటుంది. సకల ప్రాణులు ఆకలి, కామము అను రెండు ప్రాథమిక శక్తుల చేత నిర్దేశింపబడుతున్నాయి. కాని వీటికి పరిధులు, పరిమితులు వున్నాయి. పశు జ్ఞానంతో పుట్టిన మానవుడు తాను పెంపొందించుకున్న మానసిక ధార్మిక శక్తుల వల్ల విజ్ఞాని అయి పురోగమించి ముందుకు రాగలిగాడు. అందువల్లే జననాలను తగ్గించడం ద్వారా జనాభాను పరిమితం చేయగల శక్తి ఒక్క మానవునికి మాత్రమేవుంది.

ప్రతిపనికి ఒకపరిధి, పరిమితి వుంటాయి. లేకపోతే మంచి చెడుగా మారిపోతుంది. సముద్రం లోని ఒక గుల్లచేప ఏటా 300 గ్రుడ్లు పెడుతుంది. అదే తీరున మొత్తం చేపలు అలా గ్రుడ్లుపెట్టి పొదిగితే దాని సంతతి 5ఏళ్ళలో భూమిసైజుకు రెట్టింపు కావచ్చు. అయితే ప్రకృతిలో ఏజాతి ఉత్పత్తి ఎంత ఎక్కువైతే దాని జీవితం అంత అల్పమవుతుంది. ఒకనాడు జీవించివున్న మహా కాయంగల జంతువులు ఈనాడు మచ్చుకైనా లేవు. జీవరాసుల తెగలు అనేకం నశిస్తున్నాయి. అలా సృష్టి జీవరాసులను తానే క్రమబద్ధం చేస్తుంది. కనుక జీవరాసుల సంఖ్యను నియమబద్ధం చేయటం సృష్టిక్రమానికి వ్యతిరేకం కానేకాదు. జనాభా విపరీతంగా పెరిగినప్పుడు ఏది వరదలో, భూకంపాలో, అంటువ్యాధులో. కరువులో, విషవ్యాధులో వచ్చి జనాభాను చంపుకోవడం సృష్టిక్రమంలోనేవుంది. అసలు ఏ మందయినా విందు అయినా మోతాదు మించితే అదే విష మవుతుంది. మన పూర్వీకులు కొన్ని తిథులు, వారాలు, వర్జాలలో విధి నిషేధాలు ఏర్పరచి మానవ సృష్టిని క్రమబద్ధం చేసేవారు. ఆ నిషేధపు రోజుల్లో పిండప్రధానం జరిగితే అనిష్టదాయకం అవుతుందని, ఆ బిడ్డ నష్టజాతకుడు అవుతాడని వారినమ్మకం; వారి ఆచారం కూడాను. కనుక నేటి ఆధునికులు ఆధునిక పద్దతులద్వారా జననాలను ఆపు చేయుడంలో తప్పేమీ లేదు.

జన్మ నిగ్రహంవల్ల సృష్టిలో దుబారా పెరుగుతున్నది అనే భావం తర్కానికి నిలవదు. పురుషవీర్యంలో కొన్ని కణాలలో ఒకే ఒక్క కణం జీవోత్పత్తికి దోహదంచేస్తుంది. మిగతావిఅన్నీ ఎలాగూ దుబారా కాక తప్పదు కదా! అలాగే స్త్రీ అండాశయంనుండి ప్రతినెలా ఒకఅండం తయారవుతుంది. అందులో ఒక్కటిమాత్రమే పిండోత్పత్తికి చాలు. మిగిలినవన్నీ అంటే (ఆమెయుక్తవయస్కురాలై నప్పటినుండి ముట్లు ఉడిగేవరకు) సుమారు 500 అండాలు ఎలాగూ దుబారాకాక తప్పడంలేదు. సృష్టిలో అనేక రకాలయిన పనికిమాలిన జీవరాసులు లేవా ? కనుక సృష్టిలోనే దుబారా, దండుగమారితనం ఇమిడివుంటాయి.

"భగవదేచ్ఛ ప్రకారం తమ సంతానోత్పత్తి కాలమంతా కనటమే మన విధి." "నారుపోసినవాడే నీరుపోస్తాడు." ఇవన్నీ మానవాభివృద్ధి చెందని రోజుల్లో, వేటాడే దశలోని భావాలు. ఆనాడు జనాభా అభివృద్ధి అనివార్యమయింది. ఈనాడు అలా పిల్లల్ని కంటూవుంటే ఈవిశ్వమే ఒక పుట్టకురుపు అయి అందులో మానవుడొక 'సెల్'గా మారిపోతాడు. దేవుడే నీరుపోస్తాడనే వాదానికి బలంలేదు. పురుష ప్రయత్నం లేకుండా ఏ పదార్థంకాని, ఏ వస్తువుకాని ఆకాశం నుండి వూడిపడదు. అలా జరుగుతున్నట్లు ఆధారాలు లేవు. అలా వుంటే కరువూ కాటకాలూ వుండవు; మనకు శ్రమా, బాధా అసలే వుండవు. కర్మసిద్ధాంతం ప్రకారం జనన మరణాలు సంభవిస్తాయని నమ్మే కర్మవాదులు కూడా దేవుడే పోషిస్తాడు అని వూరుకుంటే 'గాలిలో దీపంలా' ఆరిపోతాం అనే భయంతో సకల ప్రయత్నాలూ చేస్తూనే వుంటారు. అసలు విజ్ఞాని అయిన మానవుడు కర్మసిద్ధాంతం ప్రకారమయినా తాను చేసే పురుష ప్రయత్నంవల్ల జీవులు సుఖశాంతులను పొందగల కర్మనే ఆచరించటం సర్వదా శ్రేయస్కరం కాదా! భగవదేచ్ఛప్రకార మనుకున్నా, ఆ భగవంతుడే మనకు ఆలోచనాశక్తి, ఊహాజ్ఞానం, విచక్షణా బలం ఇచ్చినప్పుడు వాటిని వినియోగించక పోవటం మాత్రం అధర్మంకాదా! మన జీవితాలను మనం నీతిగా ధర్మంగా సరిదిద్దుకుంటే 'దేవుడు' తప్పక సహిస్తాడు, సంతోషిస్తాడు; ఆశీర్వదిస్తాడుకూడా.

ప్రకృతి సహజ శక్తులకు కు. ని. వ్యతిరేకమనేది పొరపాటు అభిప్రాయం. ఒకప్పుడు ఎండా, వానా, గాలీ, చలికి భయపడ్డ మనం ఈనాడు అధిగమించబట్టే మనం నాగరికులం కాగలిగాం. నదులకు ఆనకట్టలు కడుతున్నాం, అంటురోగాలను అరికడుతున్నాం. భూ జలాకాశ విహారాలు

చేస్తున్నాం. మానవ మేధాశక్తి అమోఘం, అద్వితీయం. కనుకనే ఒకనాడు దేవుడనుకున్న చంద్రుణ్ణి ఈనాడు గోళమని తెలుసుకున్న మనం ఆ చంద్రుని మీదికి దిగి పరిశోధనలు చేస్తున్నాం. అందువల్ల అభ్యుదయ గాములము అయినాము. ఇవంటా ప్రకృతి సహజ శక్తులను అధిగమించిన ఫలంగా మనం గుర్తిస్తున్నప్పుడు కు. ని. కూడా ప్రకృతికి వ్యతిరేకం కానేకాదు.

కొన్ని పద్ధతులు అంటే ఆపరేషన్‌లవల్ల శారీరక, మానసిక వైపరీత్యాలు వస్తాయనే ప్రచారం కల్ల. ఇతరత్రా ఏదైనా దుర్బలత్వం వుండే, లోటుపాట్లు వుంటే అవి ఆపరేషన్‌వల్ల వచ్చాయని ప్రచారంచేయటం అసంబద్ధం. చేయించుకున్నవారిని అడిగిచూడాలి

కు. ని. పుట్టబోయే ప్రముఖులను, విజ్ఞులను పుట్టకుండా ఆపుదల చేస్తుంది అనేది మాత్రం కొంత నిజం. రవీంద్రనాథ టాకూర్ తల్లికి 13వ బిడ్డగా పుట్టాడు. ఒకరిద్దరితో కంట్రోల్ చేస్తే ఆమేధావి మనకు దక్కేవాడా? అని ప్రశ్నిస్తున్నారు. కాని సహజంగా ఏ నూటికో కోటికో ఒక్కడే అలాంటి మహాత్ముడు పుడతాడు. ప్రతితల్లికీ అలాంటివాడు పుడతాడు అనేగ్యారంటీ ఏమీ లేదు. గౌతమబుద్ధుడు, ఏసుక్రీస్తు ఒక్కబిడ్డగా పుట్టినా గొప్పవారుకాలేదా! అలాంటి అప్పుడు ఒకరికోసం వందల మందిని పోషించగలమా అనేదికూడా ఆలోచించుకోవాలి.

దేశభద్రతకు జనసంఖ్య పెంచుకోవాలి అనే 'డిమాండు' అర్థరహితం. ఈనాడు కేవలం ఒక్క అణుబాంబు పేలితే వేల ఎకరాల భూమిని, లక్షల జనసంఖ్యను అది సర్వనాశనం చేస్తోంది. అందువల్ల జనసంఖ్య కంటే ఆయుధాలకే విలువ పెరిగింది. కనుక దేశాన్ని రక్షించేది జనసంఖ్య కాదని తేలిపోయింది. పైగా మనం బిడ్డల్ని కని పెంచేది యుద్ధాలలో చంపుకోటానికి కాదుకదా! ఒక్కసైనికుడుకాని, ఆఖరికి ముసలితాతగాని చనిపోతేకూడా మనం బాధపడుతూనే వుంటాం. కనుక మరణాలంటేనే మనకు బాధ. అంతే కాదు యుద్ధాలకొరకు బిడ్డల్ని కనే తల్లులుండబోరు.

కు. ని. సాధనాలవల్ల అవినీతి పెరుగుతుంది అనే విష ప్రచారం నమ్మ తగింది కాదు నీతి అవినీతి ప్రజల ఆచార సంప్రదాయాల మీద ఆధారపడి వుంటాయి. అవినీతిపరులు ఆనాడూ ఈనాడూ వున్నారు. అవకాశాలు

వున్నా చాలామంది నీతికి నిలబడి దొంగతనాలు చెయ్యరు; అసత్యాలుచెప్పరు. కనుక నీతి, అవినీతి అనేవి అవకాశాలమీద ఆధారపడి వుండవు. వారి వారి మనస్తత్వాలపైన ఆధారపడి వుంటాయి. తమ అవినీతి ప్రవర్తనకోసం పూర్వులు వేశ్యాకులాన్ని సృష్టించుకోలేదా ? అందువల్ల ఆధునిక కుటుంబ నియంత్రణ పద్ధతులను నీతితో ముడిపెట్టటం భావ్యం కానేకాదు.

కు. ని. సంస్కారులు ఎక్కువగా ఆచరించడంవల్ల వారి సంఖ్య తగ్గుతున్నదనే వాదన సత్యదూరంకాదు. కాని తగిన భృతి, నష్టపరిహారం ఇస్తున్నందువల్ల ఇతరులు కూడా అనుసరిస్తున్నారు. అదీకాక సంస్కారుల సంఖ్య ఎప్పుడూ తక్కువే. అయినా వారి ప్రభావం ప్రజలమీద ఎప్పుడూ వుంటూనే వుంటుంది సంతానం మానవునికి పర ప్రసాదమని, సంతాన వాంఛ స్త్రీ పురుషులకు సహజ లక్షణమనే ధ్యేయంతో "సంతాన ప్రాప్తిరస్తు, వంశాభివృద్ధిరస్తూ" అంటూ మన పూర్వీకులు ఆశీర్వదించేవారు. అప్పుడు హెచ్చు సంతానం అని చెప్పడానికి గర్వపడేవాళ్ళు. అలాంటి వారికి ఈ సంస్కరణలు విపరీతంగా తోచవచ్చు.

ఇవన్నీకాక మరో విమర్శవుంది. అదే జీవహింస, భ్రూణ హత్యావాదాలు. పురుష వీర్యంలోని జీవకణం స్త్రీ శోణిత మండలి అండంతో కలిసినప్పుడే పిండోత్పత్తి అవుతుంది. అప్పుడే ప్రాణం ఏర్పడుతుంది. కు. ని. సందర్భంగా చేసే మన ప్రయత్నాలన్నీ ఈ జీవోత్పత్తికి వ్యతిరేకంగా పనిచేసేవే. అసలు పిండోత్పత్తి లేనిదే ప్రాణమే వుండదుకదా! ప్రాణమే లేనిదే హత్య ఎలా జరుగుతుంది? అదే నిజమనుకుంటే పురుష వీర్యంలోని ఒక్క కణం జీవోత్పత్తికి పోను మిగిలిన వాటి నన్నింటిని మనం ప్రతిసారి హత్యచేస్తున్నట్లేకదా! మరి అదిమాత్రం జీవహింస, భ్రూణహత్య కాదా?

కాలము, పరిస్థితులు మారిపొయ్యాయి. నేటి వుత్పత్తికి, పెరుగుతున్న జనాభాకు ఎక్కడా పోలికేలేదు. ఈనాటి ప్రజలకు నాగరికత, విషయ పరిజ్ఞానం పెరిగింది కనుక పరిస్థితులను అర్థం చేసుకోగలరు. అసలు సంఘంలో ఒక క్రొత్త మార్పు వచ్చినప్పుడు అనేక వాదోపవాదాలు జరగడం, సమసిపోవటం మనకు క్రొత్త విషయంకాదు. మన తాత ముత్తాతలనాడు సహగమనం ఆచారం. ఈనాడు దానిని చట్ట విరుద్ధం, సాంఘిక అవినీతిగా భావిస్తున్నాం.

అలాగే విధవా వివాహాలపై, వర్ణాంతర వివాహాలపై ఎన్నో దూషణలు అప హాస్యాలు జరిగి ఈనాడు అవి సర్వ సాధారణాలు అయ్యాయి. బాల్య వివా హాలు "అష్టవర్షాత్ భవేత్ కన్యా" అనేదే వేదమని నమ్మి చెయ్యటం, వివాహాత్ పూర్వం ఏ పిల్లయినా రజస్వల అయితే వెలివెయ్యడం మన కళ్ళతో చూచినవే గదా! ఆదిలో స్త్రీల సంఖ్య తక్కువ కనుక కన్యాశుల్కం వుండేది. దరిమిలా వరకట్నం ఆచారమయింది. ఈనాడు ఆ రెండూ దూష్యాలు, చట్ట వ్యతిరేకాలు అయినాయి. ఒకనాడు బహుభార్యాత్వం, మరొక దశలో బహుభర్తృత్వం ఆచారంగా వుండేవి. ఈనాడు అవి రెండూ పూర్తిగా నిషేధింప బడలేదా? ప్రతి సంస్కరణా, సిద్ధాంతం కాలాన్ని బట్టి మార్పు చెందటం తథ్యం; అని వార్యం కూడాను.

ప్రతి వ్యక్తీ కనడమే పవిత్రత కాదని. కన్న ప్రతి వ్యక్తినీ ఆరోగ్యం, విజ్ఞానం, స్వయంపోషణశక్తి, మానవ సేవానిరతి కలవానినిగా చేయడం తల్లిదండ్రుల కర్తవ్యం అనీ గ్రహించాలి. ఇందులో ఏ లోపం జరిగినా దానికి' కారకులు తల్లిదండ్రులే. 'మితిమీరిన సంతానాన్ని కనడం మతిలేని మహా పాప మని మనం ముందుగా నమ్మాలి. పెళ్ళికి, పిల్లలకు సంబంధించిన ఆచారాలు, సంప్రదాయాలు, మత విశ్వాసాలు, మహిళల విద్య, వారి సాంఘిక స్థాయి ఆర్థిక స్థితిలాంటి సమస్యలన్నీ జనాభా పెరుగుదలకు కారణాలనేది నగ్న సత్యం. కనుక సాంఘిక చైతన్యం కల వ్యక్తులు అజ్ఞానమనే అంధకారంతో చుట్టబడిన ఛాందసాచారాలను విజ్ఞానమనే జ్యోతితో పారద్రోలి జాతి జీవన విధానానికి, మహిళా వికాసానికి తోడ్పడగలరని ఆశిద్దాం.

# జాతీయ జనాభా విధానం

విద్యావతి

సి. శేషారత్నం

ఐక్యరాజ్య సమితి ఏర్పాటు చేసిన ప్రపంచ జనాభా మహాసభలో భారత దేశం ప్రముఖ పాత్ర వహించింది. ప్రపంచ జనాభా విధానం అవతరించింది.

అంతకు ముందు అనుసరిస్తున్న విధానంకన్న చురుకైనదిన్నూ, ఆధార యుతమున్నూ అయిన నూతనవిధానాన్ని కేంద్ర ఆరోగ్య, కుటుంబ నియంత్రణ మంత్రి 16-4-76న ప్రకటించారు. జనాభా సమస్యను పరిష్కరించటానికి అనేక మౌలిక విధానాలను రూపొందించడం జరిగింది.

1. వివాహ వయఃపరిమితిని పెంచుటకు - పురుషునికి 21 సంవత్సరాలు స్త్రీకి 18 సం॥ నిండాలని, శాసనం ప్రవేశ పెట్టుటకు నిశ్చయించడమైనది.

2. అన్ని రాష్ట్రాలలో స్త్రీ విద్యను వృద్ధి చేయడానికి ప్రభుత్వం చర్యలు తీసుకొనుట.

3. ప్రజానీకంలోని బీదలు కుటుంబ నియంత్రణను ఆమోదించటం వారికివ్వబడే ప్రోత్సాహక పారితోషికంపై ఆధారపడుతుందని గ్రహించి ఆ మొత్తాలను పెంచడం. నల్గురుపిల్లలున్నవారు వంధ్యాకరణ ఆపరేషను చేయించుకుంటే రు. 70, ముగ్గురు పిల్లలున్న వారికి రు. 100, ఇద్దరు పిల్లలున్న వారికి రు. 150గా పెంచడానికి నిర్ణయింపబడినది. మందుల ఖర్చు, ఆస్పత్రి ఖర్చు ఈ రెండూ కూడా ఈ మొత్తాలలో జమచేయబడినాయి.

జాతీయ జనాభా విధానాన్ని ప్రకటించగానే దేశంలోని అత్యయిక పరిస్థితిని ఆసరాగా తీసుకొని విధిగా వంధ్యాకరణ ఆపరేషన్ల విషయమై భారీ ఎత్తున ప్రభుత్వం చర్యకు పూనుకొన్నది. 1976 - 77 సంవత్సరంలో 43 లక్షల ఆపరేషన్లు జరపాలని లక్ష్య నిర్దేశనం జరుగగా ఆ సంవత్సరం 82 లక్షల ఆపరేషన్లు జరిగాయి. ప్రోత్సాహక చర్యలవల్ల గాక బలవంతం మీద ఈ విధానం అమలు పరచబడింది. ఆపరేషన్ల సంఖ్యను పెంచడానికి ప్రభుత్వం తన పరిపాలనాధికారాన్ని వినియోగించిందని ప్రజానీకం భావించింది.

సామాన్య ఆరోగ్య సదుపాయాలను నిర్లక్ష్యం చేయటం వలన కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు వృద్ధి చెందాయి. ఆస్పత్రులలో లభించే మామూలు వైద్య సౌకర్యాలు దెబ్బతిన్నాయి.

జనాభా సమస్యను పరిగణించేటప్పుడు సమాజం యొక్క రాజకీయ, ఆర్థిక, సామాజిక అంశాలను వాటి మధ్య వున్న పరస్పర సంక్లిష్ట సంబంధాలను లెక్కలోకి తీసుకోవాల్సి వుంటుంది. ఈ దృష్టితో ప్రభుత్వ జనాభా ప్రకటన నూతన భావాలను పొందుపర్చుకొని కుటుంబ నియంత్రణ కార్యక్రమాన్ని మెరుగు పర్చటానికి అనేక మార్గాలను అన్వేషించింది.

తరువాత కుటుంబ నియంత్రణ కార్యక్రమం యొక్క రాజకీయ అంశములపై దృష్టి సారించడం జరిగింది. రాష్ట్ర ప్రణాళికలకు కేంద్ర సహాయం ఎంత ఇవ్వాలో, పన్నులను ఏ మేరకు రాష్ట్రాలకు కేటాయించాలో, గ్రాంట్ల విధానం ఏ ప్రాతిపదికపై నిర్ణయించాలో విధాన ప్రకటన నిర్దేశించింది. 1971 సంవత్సరపు జనాభాను ప్రాతిపదికగా తీసుకోవాలని అలా 2001 సం॥ వరకు సాగాలని తీర్మానం సాగింది.

కుటుంబ నియంత్రణ కార్యక్రమాలలో ఏ మేరకు విజయం సాధించాయో ఆ మేరకు రాష్ట్ర ప్రభుత్వాలకు సహాయం ఇవ్వడానికి కేంద్ర సహాయనిధిలో 8వ శాతం కేటాయించడం జరిగింది. వివాహ వయఃపరిమితిని పెంచడం, సెకండరీ స్థాయి దాకానయినా బాలికల విద్యాస్థాయిని పెంచటం విధానం యొక్క దీర్ఘకాల చర్యలు. కుటుంబ నియంత్రణను ప్రజలు ఆమోదించే దానికి ఆపరేషనులు చేసుకున్న వారికి పారితోషకములను ఇచ్చుట గురించి విధాన ప్రకటనలో ఆమోదింప బడినది.

కుటుంబ నియంత్రణ కార్యక్రమంలో ప్రజలకు ప్రమేయం కల్పించే నిమిత్తం కార్యక్రమాన్ని చేపట్టిన గ్రూపులకు, సంఘాలకు ప్రోత్సాహకాలను కల్పించింది.

స్వచ్ఛంద సంస్థల సహకారాన్ని గుర్తించి వాటికి సమర్థనను కల్పించడానికి నిర్ణయం చేయబడింది. అలాంటి సంస్థలకు ఇచ్చే ప్రోత్సాహక ధన సహాయానికి ఆదాయపు పన్ను పరిధి నుండి మినహాయింపు ఇవ్వడం జరిగింది.

ప్రజలకు కార్యక్రమం యెడల సుముఖతను కలుగజేసే నిమిత్తం అన్ని ప్రసార సాధనాలను వినియోగించుటకు, సంప్రదాయ జానపద రీతుల ద్వారా కుటుంబ నియంత్రణం ఎడల ఆసక్తిని ప్రేరేపించడానికి, సుస్థిరం చేయడానికి నిశ్చయింప బడినది.

1977 మార్చిలో కేంద్రంలో నూతన ప్రభుత్వం అధికారంలోకి రాగానే 1977 ఏప్రిల్‌లో నూతన జనాభా విధానం ప్రకటితమైనది. "ఇప్పుడున్న రేటు ప్రకారం జనాభా పెరుగుతూ పోతే ప్రజలకు పని కల్పించడానికే, ఉత్పత్తి సాధనాలకు అవసరమైన వనరులను ఏర్పరచడానికి జనాభాను అదుపు చేయడం తప్పనిసరి అవుతుంది; జనాభాపై అదుపే ముఖ్యమైన పెద్ద కార్యక్రమంగా రూపొందుతుంది.

నూతన విధాన ప్రకటనలో కుటుంబ నియంత్రణ కార్యక్రమం 'కుటుంబ సంక్షేమ కార్యక్రమంగా' రూపం తాల్చింది. కుటుంబ సంక్షేమానికి తీసుకునే అనేక చర్యలు మానవ జీవితాన్ని గుణాత్మకంగా మెరుగు పరచడానికి ఉద్దేశించ బడినాయి. 'వంధ్యాకరణ' అంటే 'స్వచ్ఛంద వంధ్యాకరణ' అనే అర్థాన్ని ఇచ్చింది నూతన విధానం. పూర్వంలాగా 'లక్ష్యాల' నిర్దేశనగాక "ఆశించిన ఫలితాల" స్పష్టీకరణ అవతరించింది.

**నూతన విధాన లక్ష్యాలను ఇలా పేర్కొన వచ్చును:-**

(i) మాతా శిశువుల ఆరోగ్యాన్ని పెంపొందించడం కుటుంబ సంక్షేమ కార్యక్రమంలో భాగం కావాలి. మొత్తం ఆరోగ్య పథకంలో దానికి సరియగు స్థానం లభించాలి.

(ii) పోషకాహారం, తిండి, బట్ట, ఇల్లు, రక్షిత మంచినీరు, విద్య, స్త్రీ సంక్షేమం లాంటి వాటికై జరిగే ఇతర సంక్షేమ కార్యక్రమాలలో కుటుంబ సంక్షేమ కార్యక్రమం అర్థవంతంగా సమీకృతం కావాలి.

(iii) కుటుంబ నియంత్రణ రంగంలో బలవంతపు చర్యల పట్ల కలిగే భయ సందేహాలను పారద్రోలాలి.

(iv) చిన్న కుటుంబ పద్ధతిని ప్రజలు ఆమోదించే ఉద్దేశముతో, ప్రతి కుటుంబమూ తన ఇచ్ఛ వచ్చిన జన్మ నిగ్రహ విధానాన్ని ఎన్నుకునే అవకాశం ఉండేలాగున అన్ని జన్మ నిగ్రహ విధానాల వాడుకను ప్రోత్సహించ వలెను.

**(v)** ఆత్యధిక కుటుంబ సభ్యత్వాన్ని పొందిన దంపతులు అనుసరింప దగు వంధ్యాకరణ శస్త్ర చికిత్సా విధానాన్ని ప్రజలకు అందుబాటులోనికి తెచ్చి వారికి ఆ విధానాన్ని ఉచితంగా అందజేయ వలెను.

**(vi)** గర్భిణీ స్త్రీలకు ప్రసవానికి పూర్వమూ, ప్రసవానంతరం తగిన జాగ్రత్త చర్యలను, అలాగే ప్రసవ సమయంలో సేవా సదుపాయాలను అందించవలెను.

**(vii)** జనాభాలో 15 సంవత్సరముల లోపు వయస్సు కల 42 శాతం ప్రజలకు జనాభా విద్యను అందించ వలెను.

**(viii)** కుటుంబ సంక్షేమ కార్యక్రమంలో ప్రజలు స్వేచ్ఛగా పూర్తిగా భాగస్వాములు అయ్యేలాగున కృషిచేసి తద్వారా జనాభా పెరుగుదల రేటును 1000 కి 30 నుండి 25 కు తగ్గించ వలెను.

**(ix)** సామాజిక సేవా రంగంలో కృషి చేస్తున్న స్వచ్ఛంద సంస్థలు మరియు ఇతర సంఘాలు కుటుంబ నియంత్రణ కార్యక్రమాన్ని ఆమోదించ టానికి అవసరమైన ప్రజాభిప్రాయాన్ని సృష్టించ వలెను.

**సాధించిన విజయాలు:-**

జాతీయ జనాభా విధానములో పొందుపరచబడిన అనేక చర్యలను ప్రభుత్వం చేపట్టింది.

1. బాల్య వివాహ నిషేధ (సవరణ) శాసనాన్ని 1978 లో పార్ల మెంటు ఆమోదించింది. వధువు వివాహ వయః పరిమితిని 15 నుండి 18 సంవత్సరములకు, వరుని వివాహ వయః పరిమితిని 18 నుండి 21 కు పెంచట మైనది. శాసనోల్లంఘనం విషయమై పోలీసులు చర్య తీసుకోవ టానికి అనువుగా శాసనాన్ని మార్చటం జరిగింది.

2. గ్రామీణ ఆరోగ్యాన్ని పెంపొందించటానికి వీలుగా గ్రామీణ ఆరోగ్య పథకాన్ని పునర్నిర్మాణం చేసింది ప్రభుత్వం. అన్ని వ్యాధులపై అదుపు, అద నపు కార్యక్రమాలు, వాటికి నిధులు, వివిధ రంగాలలో పనిచేసే సిబ్బంది పథకం ఇవి అన్నీ కూడ గ్రామీణ ఆరోగ్యాన్ని, కుటుంబ సంక్షేమాన్ని వివిధ వ్యాధి నిరోధాన్ని సాధించే నిమిత్తం ఉద్దేశింప బడగా కేంద్ర ఆరోగ్య సంక్షేమ పథకం వీటి అన్నింటినీ సమీకృతం చేసింది.

3. 1971 నుండి గర్భవిచ్ఛిత్తి శాసనాన్ని అమలు పరచ ప్రారంభించి నప్పటినుండి ఇప్పటికి 901,691 ఆపరేషన్లు జరిగాయి. ఆ చట్టం క్రింద ప్రభుత్వ ఆమోదం పొందిన సంస్థలు 2476 వరకూ ఉన్నాయి.

4. వంధ్యాకరణ శస్త్ర చికిత్సా రంగంలో బలవంతాన్ని, ఒత్తిడిని, దాక్షిణ్యాన్ని తీసివేసి స్వేచ్ఛాయుత ఆమోదానికి ప్రాముఖ్యత ఇవ్వబడినది.

1976-77 సంవత్సరంలో వంధ్యాకరణ ఆపరేషన్ల సంఖ్య 8.26 మిలియన్లు కాగా 1977-78 నాటికి అది 0.95 మిలియను లయింది. అలాగే లూపు అమర్చే సందర్భంగా హర్యానా పంజాబు, ఢిల్లీ, చండీఘర్ ప్రాంతాలు బాగా కృషిచేశాయి. 1976-77 లో 58 లక్షల లూపు అమరకాలు జరుగగా 1977-78లో 33 లక్షలు మాత్రమే జరిగాయి. కాండంలు, జెల్లీట్యూబులు, నుసుగు బిళ్ళలను వాడేవారి సంఖ్య 1976-77లో 3.68 మిలియన్లు కాగా అది 1977-78లో 3.17 మిలియన్లకు దిగజారింది. జన్మ నిగ్రహాన్ని అనుసరింప తగిన దంపతుల సంఖ్య 108 మిలియన్లు కాగా అందులో 26.3 మిలియన్ల దంపతులు మాత్రమే జన్మ నిగ్రహ సందర్భంగా రక్షితులయినారు. అంటే 24.4 శాతం రక్షితమయినదన్నమాట. అలా 1977-78 సంవత్సరంలో 5.05 మిలియన్ల జననాలను అరికట్టడం జరిగింది.

5. వంధ్యాకరణ శస్త్రచికిత్స సందర్భంగా క్రమానుగత మయిన పారితోషికం స్థానంలో అందరికీ డెబ్బది రూపాయల పారితోషికం నిర్ణయింప బడినది.

6. కుటుంబ సంక్షేమ కార్యక్రమాన్ని ఆమోదింప చేసే నిమిత్తం అన్ని ప్రసార సాధనాల ద్వారా దృష్టిని కేంద్రీకరించి సమన్వయ చర్యలను ప్రభుత్వం తీసుకున్నది. రేడియో కార్యక్రమాలు, ఆటలు, పాటలు, నాటికాలు, చిత్ర ప్రదర్శనలు, సినిమాలు, పోస్టరులు, కరపత్రాలు, సమాచార పత్రాలు, చిన్నపుస్తకాలు ఆట్టలు వగైరాలన్నింటి ద్వారా ప్రజలలో భావ ప్రచార ఉద్యమాలను ప్రభుత్వం సాధించింది.

7. దేశమంతటా సర్వప్రయోజన కార్యకర్తల శిక్షణ కార్యక్రమాలను నిర్వహించింది.

8. సమర్థవంతమై భద్రతాయుతమై, సర్వులకూ ఆమోదయోగ్యం కాగలిగి, చవకగా లభించే జన్మ నిగ్రహ సాధనాన్ని రూపొందించే నిమిత్తం అనేక వైద్య సంస్థలలో మానవ పునరుత్పత్తిపైనను, సృజనాశక్తిని అదుపు చేయటంలోను, పరిశోధన సాగించట మయినది.

## ప్రసవానంతర ప్రబోధ కార్యక్రమం

1969లో లో 59 వైద్య సంస్థలలో ఈ కార్యక్రమం ప్రారంభించబడినది. ఇది ప్రసూతి ఆస్పత్రుల ప్రాతిపదికగా సాగింది. ప్రసవానికి పూర్వమూ తరువాతా స్త్రీలు చిన్నకుటుంబ భావనను ఆమోదించటానికి జన్మ నిగ్రహ విధానాన్ని చేపట్టటానికి సుముఖులుగా ఉన్న సమయాలలో స్త్రీలలో ప్రబోధాన్ని అనుకూల సంకల్పాన్ని కల్పించటమే ధ్యేయంగా ఈ కార్యక్రమం కొన సాగింప బడినది. ఈ కార్యక్రమం ఈ దిగువ పేర్కొనబడిన హేతుబద్ధ అంశాలపై ఆధారపడుతున్నవి.

1. ఇటీవలనే ప్రసవించిన స్త్రీలు త్వరలో గర్భధారణ చేసుకొని ప్రమాదంలో చిక్కుకోటానికి విముఖులుగా ఉంటారు.

2. ప్రసవ స్థితిలో లేని స్త్రీలకన్న ప్రసవించిన స్త్రీలు కుటుంబ నియంత్రణను ఆమోదించటానికి సుముఖులుగా ఉంటారు.

3. ప్రసవం ఒకటి రెండు రోజుల్లో వస్తుందన్నపుడు, ప్రసవ కాలంలో కుటుంబ నియంత్రణ విషయమైన ప్రబోధాన్ని వినడానికి స్త్రీలు శ్రద్ధ చూపిస్తారు. కనుక ఏదో ఒక జన్మ నిగ్రహ సాధనపు వాడకాన్ని గురించి సమాచారం వారికి అందజేయటం తేలిక.

1970_71 లోను 1982_83 లోను రక్షిత దంపతుల సంఖ్యా వివరాలు ఇలా ఉన్నాయి.

| సంవత్సరం | శస్త్రచికిత్స | శాతం | లూపు | శాతం | అలాంటి సాధనాలే | శాతం | మొత్తం | శాతం |
|---|---|---|---|---|---|---|---|---|
| 1970_71 | 7584 | 81 | 1286 | 1.4 | 981 | 1.01 | 9853 | 10 6 |
| 1982_83 | 26728 | 22 | 1658 | 1.4 | 3063 | 2.5 | 31448 | 25.9 |



# జనాభా నియంత్రణ:

# ప్రజాస్వామ్య ప్రాశస్త్యం

ఒకనాడు అపహాసనకు గురి అయిన కుటుంబ నియంత్రణ ఈనాడు ప్రజామోదం పొందింది. పాతిక సంవత్సరాల నాడు దీనిని అమలుపర్చే వాళ్ళని వేళ్ళమీద లెక్క పెట్టవచ్చు. కాని ఈనాడు లక్షలాదిగా ప్రజలు దీనిని ఆచరిస్తున్నారు. ఇది పాపహేతువని పలికిన మతాధిపతులు, పీఠాధిపతులు మనస్సులు మార్చుకుంటున్నారు. వ్యతిరేకత విడనాడుతున్నారు. ముస్లింలు, క్రైస్తవులు సయితం వారి వారి మతాలకు సమ్మతమయ్యే నియంత్రణ మార్గాలను అన్వేషిస్తున్నారు. విజ్ఞానం అందించిన నవ్య కుటుంబ నియంత్రణ సాధనాల మంచి చెడ్డలను తరచితరచి చూస్తున్నారు. ఇంతగా పండితులను, మేధావులను, నాగరికులను ఆకర్షించినప్పటికీ దీని విషయం తెలియని అశేష ప్రజానీకంకోసం ప్రచారం అవసరమవుతోంది. ముఖ్యంగా ప్రజాస్వామిక దేశంలో పౌరులందరూ తమ బాధ్యతలు తెలుసుకోవాలి. పలువురు పలు అభిప్రాయాలతో కుటుంబ నియంత్రణను సమర్థిస్తున్నారు. ఆహారధాన్యాల కొరత, నిరుద్యోగం, విద్యా వైద్య సదుపాయాల లోటు, గృహనిర్మాణ వసతి లేమి, ఇతర సమస్యల పరిష్కారం, కుటుంబ నియంత్రణాన్ని అవలంబించడానికి ప్రోద్బల హేతువులని వాదించుకుంటున్నారు. ఈ వాదనల యోగ్యతా యోగ్యతలను పరిశీలించడం అవసరం. మన అవశ్య కర్తవ్యం కూడా.

ప్రపంచంలో జనాభా పెరుగుదల గుణకారంపు పద్ధతిలో పెరుగుతుంటే ఆహార ధాన్య సమృద్ధి కూడిక పద్ధతిలో పెరుగుతోందని 170 సంవత్సరాల క్రిందట ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్త మాల్థూస్ సిద్ధాంతీకరించాడు. ఇప్పటికీ ఆ సిద్ధాంత పాటవాన్ని కాదనలేని స్థితిలో వున్నాం. పరిపుష్టమైన ప్రజా పరిపాలన గల దేశాలమని చెప్పుకొనే సోషలిస్టు, కమ్యూనిస్టు రాజ్యాలు సయితం తమ జనాభాకు సరిపడినంతగా ఆహారధాన్యాలను ఉత్పత్తి చేయలేక పోతున్నాయి. ఇక మనదేశం సంగతి చెప్పనే అక్కరలేదు.

ఈ అణుయుగంలో ప్రతి ఒక్కరికీ తిండి పెట్టగలిగే స్థితి రావచ్చు. అలాగే విద్య, వైద్య, ఉద్యోగ సౌకర్యాలను ప్రభుత్వం గాని, ప్రజలుగాని కల్పించవచ్చు. జనాభా పెరిగితే వారి నివాసం కోసం ఇళ్ళు కట్టుకుంటూ పోతుంటే పంటపొలాలు ఇళ్ళ స్థలాలుగా మారిపోయి ఆహారోత్పత్తికి తగినంత భూమి కొరవడుతుందనే భావం ప్రబలంగా వుంది. ఇక వసతి గురించి ఆలోచిస్తే అమెరికాలో న్యూయార్క్ నగర వాసులకు వసతికి చాలినంత స్థలం లేకపోయేటప్పటికి చాల అంతస్థులు కల భవనాలు నిర్మించి ఆ సమస్యను కొంతవరకు పరిష్కరించారు. 110 అంతస్థులు కల "ఎంపైర్ స్టేట్ బిల్డింగ్" కన్నా సి. యస్. టవర్స్ 120కి పెంచడం ఇందుకు నిదర్శనం. ఈ రీతిగా గృహవసతిని సర్వులకు కలుగజేయ వచ్చునని ఒక రకంగా మనం అంగీకరించి మన మనస్సును సమాధాన పర్చుకోవచ్చు. కాని ఇన్నింటినీ మించిందీ, కుటుంబ నియంత్రణ సహాయం లేనిదే పరిష్కారం కానిది ఒకే ఒక చిక్కు సమస్య వుండిపోతుంది. అదే ప్రజాస్వామ్య పరిరక్షణ అనే గడ్డు ప్రశ్న.

మానవ సంక్షేమానికి, విశ్వమానవ కల్యాణానికి ప్రజాస్వామిక పద్ధతే ప్రశస్తమైనదని అందరూ అంగీకరిస్తున్నారు. కొన్ని నియంతృత్వ దేశాలు సయితం తమ రాజ్యాలను ప్రజాస్వామికమని, ప్రాథమిక ప్రజా స్వామ్యమని, జాతీయ ప్రజాస్వామ్యమని, ఇలా ఎన్నో పేర్లతో అభివర్ణిస్తున్నారు. ప్రాచీన కాలపు గ్రీకు దేశంలో నగర రాజ్యాలలో శిష్ట ప్రజాస్వామ్యం సమర్థనీయంగా ఆదర్శ ప్రాయంగా నడిచింది. దీన్ని బట్టి రాజకీయ శాస్త్రజ్ఞులు ఉత్తమోత్తమ పరిపాలనా విధానంగా ప్రజాస్వామికాన్ని పరిగణిస్తున్నారని తేట తెల్లమవుతోంది. ఇకపోతే ప్రజాస్వామిక విధానం అంటే ఏమిటి? ప్రజాస్వామ్యానికి కుటుంబ నియంత్రణానికి గల సంబంధం ఏమిటి? అనే ప్రశ్నలకు సమాధానం చెప్పుకోక తప్పదు.

ప్రజాస్వామ్యంలో ప్రజలే పాలకులు; పాలితులు కూడాను. సౌష్టవమైన ప్రజాస్వామిక వ్యవస్థలో ప్రజలు పరిపూర్ణ భాగస్వాములౌతారు. ప్రజాస్వామిక సమాజ నిర్మాణం జరగాలంటే పౌరులు బాధ్యతాయుతంగా ప్రవర్తించాల్సిన అవసరం వుంది. ప్రజలు తమ హక్కులను, బాధ్యతలను గుర్తెరిగితేనే అలాంటి ప్రవర్తన సాధ్యం అవుతుంది అలాంటి ప్రజలలో సగంమందీ

స్త్రీలు. భావిభారత దేశ సౌభాగ్యానికి, సంక్షేమానికి సుశిక్షిత పౌరులుగా బాల బాలికలను తయారు చెయ్య గలిగేది స్త్రీలు. బాల బాలికలు పాఠశాలలలో చేరక పూర్వం పూర్తికాలం తల్లిదగ్గరే గడుపుతారు. ఆ తర్వాతా కూడా వారు ఇంట్లో వుండే కాలం అమూల్యమైనది. ఇతరులను అనుకరించడం మానవ నైజం. అలాగే తరుణ వయస్కులైన బిడ్డలుకూడా తల్లిదండ్రులను అనుకరించడం స్వాభావ సిద్ధమే కదా! అటువంటి పరిస్థితుల్లో భావి పౌరుల జీవితం తల్లుల విద్యాబుద్ధులపై ఆధారపడి వుంటుదని చెప్పడం అతిశయోక్తి కాదు.

కాలమానం ప్రకారం ఈనాటి సమాజం 20 వ శతాబ్దంలో వున్నా భావాల విషయికంగా మన దేశం మధ్య యుగంలో వుంది. పరిసరాలు, పరిస్థితులు మారినా మనం పాతకాలపు ఆలోచనలతోనే జీవితాలు సాగిస్తున్నాం. అధునాతన శాస్త్రజ్ఞానం, శాస్త్రీయ దృక్పథం లేనిదే మన దేశ కాలాలకు తగినట్టుగా సమాజాన్ని చైతన్యవంతంగా నిర్మించుకోలేం! కొనసాగించుకోలేం. మరి సగం ప్రజానీకమైన స్త్రీలు ఈ స్థితిలో ఎందుకు వేరు ? అని ప్రశ్నించుకొని సమాధానం కోసం ఆరాటపడితే వాస్తవం విశదమవుతుంది. కుటుంబినిని గృహలక్ష్మిగా పేర్కొని యింటిని చక్కబెట్టే బరువు బాధ్యతలు ఆమెకు అప్పజెప్పి సుఖపడుతున్నారు పురుషులు. స్త్రీలు కూడా ఈ భావాలయందే నమ్మకం కలిగి సంచరిస్తున్నారు. దానితో విధివిరామం లేకుండా చాకిరీచేస్తూ గంపెడు సంతానాన్ని సంతరించుకొని పురుషులు ఇస్తున్న పరిమిత స్వేచ్ఛను మహద్భాగ్యంగా స్వీకరిస్తున్న స్త్రీలోకం యింటి నాలుగు గోడల మధ్య బందీ అయి సమాజపు విజ్ఞాన పరిధులకు దూరం అవుతోంది. స్త్రీలకు పౌరసత్వ హక్కులు ఇచ్చినప్పుడు వారి వికాసానికి తగిన విద్య, విజ్ఞానం సమాజ కార్యకలాపాల్లో స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు వారికి కూడా అవసరం కదా! స్త్రీలలో ఎంతమందికి అవి అందుబాటులో వున్నాయి ? ఎంతమంది వాటిని పొందగలుగుతున్నారు ? ఎంతమంది ఈనాటి సమాజం ఇచ్చే హక్కులను వినియోగించుకో గలుగుతున్నారు ? 33 కోట్ల భారతీయ స్త్రీ పౌరులలో అలాంటివారు కొద్దివేలమంది మాత్రమే వున్నారు అని తెలుసు. ఇట్టి స్థితికి కారణాలు అనేకం. ముఖ్యకారణం ఊహించడం కష్టంకాదు. ప్రతి

స్త్రీకి మాతృత్వవాంఛ సహజంగా వుంటుంది. మాతృత్వం ప్రకృతిసిద్ధమైన ధర్మం. అయితే ఆమె కోర్కెలను సమాజం వికృతమార్గాన పట్టించి, ఆమెను బహు సంతానవతిని జేసి, ఆమె జీవితకాలమంతా వారిని పెంచి పెద్దజేయడంలో వినియోగించే స్థితిని కల్పించి, ఆమెకు విద్య, విజ్ఞానం, సంస్కారం అలవర్చుకోడానికి విశ్రాంతి యివ్వకుండా ఆమె జీవితాన్ని యాంత్రికం చేసింది. అలాంటప్పుడు ఆమె వ్యక్తివికాసానికి వీలు ఎక్కడ వుంటుంది ? అందువల్ల విద్యా సముపార్జనకు, సంస్కారాభివృద్ధి కొరకు ఆమెకు విశ్రాంతి తప్పనిసరిగా ఇచ్చితీరాలి.

ఆమెలో వుండే మాతృత్వ వాంఛ, కుటుంబపు నిలకడ, సామాజిక సంక్షేమం అనే ముఖ్య విషయాలన్నింటికి సమన్వయం కుదరాలి. అలాంటి సమన్వయం వున్న సమాజమే అభ్యుదయ పథాన పురోగమించ గలదు.

స్త్రీకి విశ్రాంతి కావాలంటే పరిమిత సంతనాన్ని మాత్రమే ఆమె పొందాలి. కుటుంబ నియంత్రణను అనుసరిస్తేతప్ప అది సాధ్యంకాదు. ఇలా కుటుంబ నియంత్రణ ఆమెకు సహాయకారి అయి ఆమె జీవితానికి ఒక విలువ ఇస్తుంది.

కుటుంబ నియంత్రణను అవలంబించిన స్త్రీ తన పట్ల, తన కుటుంబం పట్ల, సమాజం పట్ల తన బాధ్యతలను నిర్వర్తించి బిడ్డలను పెద్దవారిగా చేసిన తరువాతనైనా సరే, తన వ్యక్తి వికాసానికి ప్రయత్నించగలదు. తద్వారా ప్రజాస్వామిక వ్యవస్థలో తనకు అర్హమగు స్థానాన్ని పొంద గలదు. పౌర హక్కులను వినియోగించుకోగలదు. ప్రజాస్వామికాన్ని జయప్రదం చేయగలదు. అందువల్ల ప్రజాస్వామ్య వికాసానికి, ఆర్థిక ప్రగతికి కుటుంబ నియంత్రణే సూటిమార్గం; ఆచరణయోగ్యం అని విశ్వసించాలి. కుటుంబ నియంత్రణ కేవలం దేశానికి, సమాజానికే కాక స్త్రీకి విలువ, విజ్ఞానం ఇచ్చి తద్వారా ప్రజాస్వామ్య రాజ్యాంగానికి సుస్థిరత్వం, శాశ్వతత్వం కలిగిస్తుందనేది నిర్వివాదాంశం.

# తల్లే తన పిల్లను చంపితే నీతికి స్థానం ఎక్కడ?

మల్లాది సుబ్బమ్మ

"సహగమనం వల్ల స్త్రీ పవిత్రమూర్తి అవుతుంది. తన్ను తాను పరిత్యజించుకుంటుననే ఔన్నత్యం వుంటుంది. భర్త గతించిన స్త్రీకి జీవితమే లేదు. 'సతి' ధర్మాన్ని తమ విధ్యుక్త ధర్మంగా ఆచరించిన మహిళలకు శాశ్వత స్థానం వుంటుంది." అంటూ ఒక సభలో గంభీరోపన్యాసం చేస్తోంది ఒక విదుషీమణి. ఆ మాటలు వింటుంటే ఒళ్ళు జలదరించింది. మనం మళ్ళీ 16 వ శతాబ్దంలోకి పోతున్నామా! మరి మనకు భవిష్యత్తు వుంటుందా? గత్యంతరం ఏమిటి? 'పోనీ అలా కాదని ఆమెతో వాదిస్తే అది సభా మర్యాద కాదు గదా' అనుకుంటూ వచ్చేశాను. ఇంతలో మరో వింతవార్త చదవటం తటస్థించింది. అది నోబెల్ శాంతి బహుమతి గ్రహీత మదర్ థెరీసా ప్రపంచ స్త్రీలకు 1986 లో ఇచ్చిన సందేశం. అది స్త్రీ జాతిని నిర్వీర్యం చేసి చీకటి యుగంలోకి నెట్టివేసే ఆదేశం. అందువల్ల ఆ వివరాలు తెలిసికోవటం మనముఖ్యకర్తవ్యం.

మియామి (MIAMI) లో 1986 లో ఒక గర్భస్రావ వ్యతిరేక సంస్థ వారు ఏర్పాటు చేసిన సభ అది. దానికి 1600 మంది సభ్యులు హాజరైనారు. ఆ సమావేశానికి ముఖ్య అతిథిగా హాజరైన మదర్ థెరీసా పలికిన "సుభాషితాల" లో కొన్ని:- "గర్భస్రావం వల్ల స్త్రీ తన పిల్లను చంపుకోవటమే కాదు, భయంకరమైన పాపానికి పాల్పడి తన అంతరాత్మను కూడా చంపుకొన్న దవుతుంది. అసలు మీకు పిల్లలు అక్కర్లేక పోతే నాకు ఇచ్చెయ్యండి. ఆ బిడ్డలు నాకు కావాలి. తృతీయ ప్రపంచ దేశాలలో జనాభా పెరుగుదలను అరికట్టాలంటే ప్రకృతి సహజ లక్షణాలయిన బ్రహ్మచర్యం, సేఫ్ పిరియడ్, స్ఖలన నివారణ, స్ఖలన విరామం లాంటి పద్ధతులను ఆచరించాలి కాని గర్భస్రావం చేసుకుంటే అది గొప్ప పాపానికి హేతువు

అవుతుంది. అసలు జీవాన్ని నిర్మూలించే పద్ధతులను, జన్మనిగ్రహ సాధనాలను (CONTRACEPTIVES) ఉపయోగించే హక్కు మనకు ఎవరిచ్చారు ? గర్భస్రావం శాంతిని, ప్రేమను నాశనంచేస్తుంది." అంటూ ఆవేశంతో ప్రశ్నించింది థెరీసా.

అలాగే 1982లో ఆమె ఒక మహాసభలో ఇలా అన్నది. "మాతృత్వం వహించడానికి మాత్రమే దేవుడు స్త్రీని సృష్టించాడు. అది చాలా ఉత్కృష్టమైనది స్త్రీకి స్థానం ఇల్లే. ఆమె పిల్లల్ని కంటూ, ఇంట్లో వుంటేనే మంచిది. ఉద్యోగినులైన స్త్రీలు తమ పిల్లల ఆలనా పాలనా పట్టించుకోరు. అందువల్ల పిల్లలు మత్తుమందులు సేవిస్తూ సంఘ విద్రోహులౌతున్నారు. కనుక పిల్లల పోషణ, గృహ సంరక్షణ భారం మాత్రం స్త్రీలు వహించాలి. బైటి పనులు గొప్ప గొప్ప పనులు చేసే సమర్థత పురుషులకే వుంటుంది. దేవుడు వారిని అందుకే పుట్టించాడు." అని థెరీసా హెచ్చరించింది. "గర్భస్రావం అంటే జీవిని గర్భంలో ఖూనీ చేయటమే. గర్భస్రావాన్ని మించిన పాపం మరొకటి లేదు. తల్లి తన సొంతబిడ్డను చంప చూస్తే ఆమె పాపానికి పరిహారముంటుందా ! ఈ విషయంలో స్త్రీకి స్వేచ్ఛ ఇస్తే సర్వపాపాలకు అనుమతి ఇచ్చినట్లే. తల్లే తన పిల్లను చంపితే మంచి మనగలదా ? జన్మ నిగ్రహాన్ని కోరేవారు ఆత్మ నిగ్రహాన్ని ఎందుకు పాటించరు ?" అని ఉద్వేగంతో థెరీసా ప్రశ్నించింది ఆ సభలో.

ఆనాటి ఆ సభ జరుపబోవు ప్రపంచ మహిళా మహా సభకు ముందుగా జరుగుతున్న సన్నాహక సమావేశపు ముగింపు సమావేశం. అందులో మదర్ థెరిసా ప్రసంగంలోని ముఖ్యాంశం అది. ఆ సభకు 26 దేశాల ప్రతినిధులు, దేశదేశాలనుండి స్త్రీ జనాభ్యుదయ సంఘాల ప్రతినిధులు హాజరై ప్రపంచంలో స్త్రీల హోదాను ఎలా పెంచాలో, పురుషులతో సమాన ప్రతిపత్తిని స్త్రీ ఎలా సాధించాలో, సమాజంలో స్త్రీ ఎలా దోపిడి చెయ్యబడుతోందో, సాంఘిక అన్యాయాలకు ఆమె ఎలా గురి కాబడుతోందో తక్కువ జీతంతో మిక్కుటమైన శ్రమతో, భద్రతలేని ఉద్యోగంతో ఆమె ఎలా నిరాదరణకు గురి అవుతోందో అనేవి ఆనాటి ఆ సభలో ముఖ్యమైన చర్చనీయాంశాలు. స్త్రీల చాకిరికి గౌరవం వుండాలని, వాళ్ళపనికి విలువ ఇవ్వాలని వారి పనిలో నైపుణ్యం పెరగాలని, వరుమానం పెంచాలని, వారిలో ఆత్మవిశ్వాసం వృద్ధికావాలని వాదిస్తున్న సభ అది. స్త్రీల ఆరోగ్యము, ఉనికి, గౌరవం పెంపొందాలని, వివిధ

రంగాలలో సమానావకాశాలు వుండాలని, అన్ని సందర్భాలలో స్త్రీ పురుష భేదాలు నశించాలి అనేవే వారి ధ్యేయాలు. ఈ సమస్యల పరిష్కారానికై తపనతో నిర్ణయాలు చేసే తుది సమయంలో థెరిసా ఇచ్చిన సందేశం వారికి విభ్రాంతి కలిగించింది. ప్రత్యేకాహ్వానితుల్ని అవమానపరిచే ప్రశ్నలతో దుయ్యబట్టటం సభ్యత కాదని మిన్నకున్నారు. అయినా ఆ సమస్య పూర్వా పరాలు విచారించి నిర్ణయాలు సూచించే బాధ్యత మన మీద వున్నది.

మదర్ థెరిసా సలహా మేరకు స్త్రీలు వంటయింటికి పడకటింటికే పరిమితమైతే సమాజం మరింత దుష్పరిణామాలకు లోను అవుతుందనే విషయం మరువరానిది. ఇప్పటికే మర బొమ్మలాంటిది స్త్రీ జీవితం. థెరిసా సలహా పాటిస్తే స్త్రీ జీవచ్ఛవంలా బ్రతకాలి. థెరిసా తను "నన్"గా వుండి అనాధలకు సేవ చెయ్యాలనే ధ్యేయంతో గడప దాటి రాబట్టే ఈ నాడు నోబెల్ శాంతి బహుమతి నందుకొనే స్థానానికి వచ్చింది. మరి తను నాల్గుగోడల మధ్య ఎందుకు బ్రతకలేకపోయింది? తను బైటికొచ్చి ఉన్నత వ్యక్తి కావాలని ఎందుకు ఆరాటపడ్డది? ఆమెకు ఎందుకా తపన? థెరిసా బిడ్డల్ని కంటూ పురుషాధిపత్యానికి ఎందుకు తాను అంకితం కాలేదు? తోటి స్త్రీలకు ఈ సలహా లేమిటి? బోధించేముందు తానాచరించి చెప్పాలి కదా? ఒక విషయంలో ఉన్నతురాలైనా థెరిసా సర్వజ్ఞురాలను అనుకొనుట భ్రమ. తిండిలేని వారికి, అనాధలకు, అన్నం పెట్టినంత మాత్రాన బీదరికం సమస్య తీరదు. ఆమె సలహా గీటురాయి కాదు. పిల్లల్ని కనే పని మాత్రమే స్త్రీకి మంచిదంటే స్త్రీని నలిపి, పాదాల క్రింద త్రొక్కి పాతాళానికి పంపే సందేశమది. ఇవి తిరోగమన భావాలు? మన్నించరాని విద్రోహ ప్రచారాలు. కనుక థెరీసా ప్రవచనాలను సభ్య ప్రపంచం మరోసారి పునరాలోచించాలి.

ఉద్యోగిని తనపిల్లల్ని పట్టించుకోదు అని ప్రచారం చెయ్యటం అవివేకం. 60% స్త్రీలు వ్యవసాయాది వృత్తులు చేస్తూనే వున్నారు. మరి వీరి సంతానమంతా సంఘ విద్రోహులనే దానికి నిదర్శనాలు లేవు కోట్ల సంఖ్యలో వున్న ఉద్యోగినుల బిడ్డలంతా చీడపురుగులైతే పోలీసులు దేశాన్ని రక్షించ గలరా? ప్రభుత్వం పోషించగలదా? బిడ్డలు చెడేది స్త్రీ ఉద్యోగం చేస్తున్నందువల్ల కాదు. హింసా యుతమైన సమాజం వారిని పట్టించుకోక పోవటంవల్ల. కొందరు మాత్రం మద్యం సేవిస్తున్నారు. థెరిసా పాశ్చాత్య ప్రపంచాన్ని

మనసులో వుంచుకొని ఆ మాట అన్నారు. కాని ఇండియాలో తిండి, ఉద్యోగం లేని పిల్లలకు తాగుడు, మత్తుపానీయాలు ఎక్కడినుండి వస్తాయి? స్త్రీ ఇల్లు దాటితేనే ప్రపంచజ్ఞానం వస్తుంది. ఆనాడే పిల్లలు, తల్లులు సంస్కార వంతులు అవుతారు. ఉద్యోగం వల్లనే స్త్రీకి వ్యక్తిత్వం, ఆత్మ గౌరవం వస్తుంది. అది వద్దనటం అవమానకరం. ఈ దేశంలో 40% పిల్లలు తిండి, బట్ట, నీడ, విద్య, వైద్య సౌకర్యాలకు నోచుకోని వారు వున్నారు. వారిచేత గొడ్డుచాకిరీ చేయించటం, హింసించటం లాంటి దుర్మార్గాలెన్నో జరుగు తున్నాయి. కనుక స్త్రీలు మాత్రి విజ్ఞావంతులైతేనే సగం సమస్యలు సమసి పోతాయి.

'గర్భంలో ఖూనీ చేయటమే గర్భస్రావం,' అనే థెరీసా భావం విడ్డూరం. గర్భాన్ని మోసేది, కనేది, పెంచేది స్త్రీ. ఆమెకు తన శరీరంలో సర్వాంగాలపై సర్వాధికారా లున్నట్లే గర్భంపై కూడా సర్వ హక్కులూ వుండాలి. గర్భం కావాలనుకున్నా, వద్దనుకున్నా అది ఆమె ఇష్టా ఇష్టాలపై ఆధారపడాలనేదే ముఖ్యం. తన శరీరంపై తనకు హక్కు, వ్యక్తి స్వేచ్ఛ లేని జీవితం జడప్రాయం. గర్భం వుంచుకోవాలన్నా, తీసేసుకోవాలన్నా అది ఆమె స్వవిషయం; వ్యక్తిగత హక్కు. శిశువు జన్మించిన తరువాత చంపితే హత్య. కాని గర్భంలో వున్నంతకాలం పిండం తల్లిసొత్తు. దానిపై ఇతరుల జోక్యం వుండరాదు. ఆ పిండానికి వునికే లేదు. కనుక ఆమె శరీరం పైనా, పిండంపైనా హక్కులన్నీ తల్లికే చెందాలి.

గర్భస్రావం హింస అయితే అక్కర్లేని, భరించలేని గర్భం కూడా స్త్రీకి హింసే కదా! మరి ఏది పెద్ద హింస? ఏ హింసకు లోనుకావాలనేది స్త్రీ ఇష్టానికి వదలాలి: పిండానికి విలువో, తల్లి శ్రేయస్సుకు విలువో తల్లే తేల్చు కోవాలి. అంతేకాదు, ఇష్టంలేని పిల్లన్ని కనే తల్లి వారిని సక్రమంగా పెంచ లేదు. అందువల్ల పిల్లలు పనికిమాలిన వారు అయ్యే ప్రమాదం వుంది. ఇది సామాజిక విద్రోహం అని చెప్పుకోవచ్చు. భావి పౌరుల్ని కని వారిని అనాథల్ని, నేరస్తుల్నిగా చేయడమే నిజమైన హత్య. అది సహించరాని నేరం. ఇష్టం లేని, భరించలేని, గర్భాన్ని పరిత్యజించటం శ్రేయస్కరం. స్త్రీకి ఆ స్వేచ్ఛ ఇవ్వలేని సమాజం శవం లాంటిది. థెరీసా భావాలు ఈ సందర్భంగా ప్రమాదకరమైనవి. ఆమె ఒక ఉద్యమంలో ఘనురాలై సంత మాత్రాన ఆమె

బోధలు సర్వదా శిరోధార్యాలనుకోవటం అజ్ఞానం. కాలాన్నిబట్టి పరిస్థితులు మార్చుకోవటమే అభ్యుదయం; అదే నిజమైన నాగరికత. ఎవరేది చెప్తే అదే తుది నిర్ణయం, 'వేదవాక్కు' అనుకోరాదు. ఆలోచించాలి, తర్కించు కోవాలి, ప్రశ్నించుకోవాలి. అదే పురోగమనం. ఢేకీసా భావాలు తర్కానికీ, అనుభవానికీ నిలవవు. వాటిని నిరాకరించాలి. ముఖ్యంగా స్త్రీల జీవితాలకు ఆ సలహాలు గొడ్డలి పెట్టు. కనుక స్త్రీలే వాటిని తిరస్కరించాలి.

# ముంచుకొస్తున్న జనాభా ప్రళయం: ప్రస్తుత కర్తవ్యం

మల్లాది సుబ్బమ్మ

వెనుకటికి రోమ్ నగరం తగలబడి పోతుంటే నీరో చక్రవర్తి వాయులీనం వాయిస్తున్నాడట. అలాగే ఇప్పటికీ కుటుంబ నియంత్రణ అక్కర్లేదు అనేవారు అనేకమంది వున్నారు. కావాలనే వారుకూడా ఆచరణ సాధ్యం కాని మార్గాలను సూచిస్తున్నారు. ఆపరేషన్లు అమానుషమంటూ బ్రహ్మచర్యం, ఆత్మనిగ్రహం, యోగం, రక్షితకాలం, ఆయుర్వేదం లాంటి విధానాలను వారు సూచిస్తున్నారు. సమస్య తీవ్రతను వారు అర్థంచేసుకోలేక పోతున్నారు. అందువల్ల సమస్య మళ్ళీ మొదటికి వచ్చిందనే భయం కలుగుతోంది. అజ్ఞానం, దరిద్రం, మతప్రభావం ఉదాసీనత, వర్గదృష్టి, స్త్రీల అవివేకం వల్ల జనం పెరుగుతున్నారు అనే విషయాన్ని మనం అవగాహన చేసుకోలేక పోతున్నాం. అందువల్ల అసలు విషయాన్ని, ముఖ్యమైన సమస్యలను, వాటి దుష్ఫలితాలను కూలంకషంగా చర్చించి తగు సలహాలను, నివారణోపాయాలను సూచించటం మన ముఖ్య కర్తవ్యం.

అధిక జనాభా వల్ల నష్టపడేది ఎవరు? స్త్రీలా, పురుషులా? సమాజమా? దేశమా? అంటే అందరూ అని చెప్పుకోవాలి. వ్యక్తి సంక్షేమానికి కుటుంబ మనుగడకు, దేశాభ్యుదయానికి జనాభా పెరుగుదల గొడ్డలిపెట్టు. అంతేకాదు, ఈనాడు ఇది ప్రపంచ సమస్యగా తయారు అయింది. ఇదొక అంటు జాడ్యం అన్నాడొక జిజ్ఞాసువు. అటం బాంబు కంటే ప్రమాదం అంటున్నారు ఆర్థిక తత్వవేత్తలు. జనాభా ప్రళయం అన్నారు ప్రణాళికా కార్యకర్తలు. ఈ పెరుగుదలను విశ్లేషిస్తూ ఇది శరవేగంతో ప్రవహిస్తున్న మానవ వాహిని అన్నాడొక సంస్కరణాభిలాషి. ఇది భయంకరమైన ప్రపంచ యుద్ధ సమస్యకంటే తీవ్రమైనదని హెచ్చరించింది మేధావి వర్గం.

కనుక జనాభా పెరుగుదల సమస్యను పరిశీలనా దృష్టితో గమనిస్తేనే తరుణో పాయాన్ని అన్వేషించగలం, లేదా జనాభా ప్రళయంలో మనం మునిగిపోయే ప్రమాదం అతి వేగంతో మనముందు కొస్తున్నది. తీరా మునిగిపోయాక విచారించటం నిష్ప్రయోజనం కదా !

ఆహార, విద్యా, వైద్య, ఉద్యోగ, గృహ వసతులు వ్యక్తికి ప్రాథమిక అవసరాలు. ఇవి అందరికీ కల్పించే ప్రణాళికలు వేస్తున్నారు. జాతీయాదాయం పెరుగుతోంది. కాని ఏటా 2.25% చొప్పున పెరుగుతున్న జనాభావల్ల వ్యక్తి జీవన ప్రమాణం సన్నగిల్లుతోంది. దేశ విభజన నాటికి ముప్పై కోట్లు వున్న మన జనాభా ఈనాడు డెబ్బైరెండు కోట్లు దాటింది. ఏటా కోటి ముప్పై లక్షల జనాభా అదనంగా పెరుగుతోంది. (మరణాలసంఖ్య పోను). ఇది ఒక ఆస్ట్రేలియా ఖండమంత అన్నమాట. ప్రపంచ సంపదలో రెండుశాతం మాత్రమే కలిగివున్న మనం, ప్రపంచ భూభాగంలో 2 % భూమి కలిగివున్న మనం, ప్రపంచ ప్రజలలో 14 % జనాన్ని పోషించాల్సివస్తోంది. ఈనాడు మనం బంజర్లు దున్నుతున్నాం, ప్రాజక్టులు కడుతున్నాం, అప్పులు తెస్తున్నాం. ఏటా 1200 కోట్ల విదేశీ మారక ద్రవ్యంతో ముడి సరకులూ దిగుమతి చేసుకుంటున్నాం. ఇంత చేసినా ఇంకా మన అభివృద్ధి గొర్రె తోకలా వుంది.

మానవ జీవన ప్రమాణం కేవలం ఒక్క అహారంతోనే సరిపోదు. ఉద్యోగం, గృహవసతి, వైద్యం లాంటివి మన సాంఘిక స్థాయికి గీటురాళ్ళు. గత 40 సం॥ రాల స్వపరిపాలనలో 42 శాతం మాత్రమే మన పౌరులు అక్షరాస్యులైనారు. "విద్య లేనివాడు వింతపశువు" అన్నట్లు ఆ విద్యవల్ల, వ్యక్తికి, సమాజానికి మాత్రమే కాక దేశానికి కూడా ముప్పుతప్పదు. చదువు సంస్కారాల వల్ల జాతికి జాగృతి కలుగుతుంది. కనుక ప్రతి వ్యక్తికి విద్య చెప్పించే స్తోమతు మన ప్రభుత్వానికి ఇపుడు ఉన్నదా అని ఆలోచించాలి. ప్రసవించడానికి గాని, ఇతరత్రా ప్రాణాపాయ స్థితిలో గాని పడకలు లభించక కొందరు, సకాలంలో తగిన వైద్యసహాయ లోపం వల్ల అనేకులు దుర్మరణాల పాలు అవుతున్నారు. ఈ దేశంలో మానవ జీవితానికి విలువే లేదు. దేశ జనాభాలో సగంమంది జీవితాలు గుడిసెలలోనే గడిచిపోతున్నాయి. అందుకు

కూడా నోచుకోని అభాగ్యులు చెట్ల నీడల్లో, పేవుమెంట్లమీద పుట్టుతున్నారు, పెరుగుతున్నారు; అక్కడే చనిపోతున్నారు. ఎండ, వాన, చలి, గాలి వారి ప్రాణాలను బలిగొంటున్నాయి. అయినా అందరికీ వాసయోగ్యమైన గృహాలను అందివ్వగలమా అనేది ప్రశ్నగానే మిగిలిపోయింది. అన్నింటి కన్నా ముఖ్యమైనది జీవనభృతి. పుట్టిన ప్రతివ్యక్తికీ అవసరమైనది బ్రతుకు తెరువు. ఏ వృత్తీ లభించక, సుఖంగా జీవించలేక అల్లాడి పోతున్నారు అనేకమంది. దానివల్ల సాంఘిక కల్లోలమే కాక రాజకీయ భద్రతకే ప్రమాదం రావచ్చు. తమ బ్రతుకు భారమై తమ కుటుంబాన్ని పోషించలేక, జీవచ్ఛవాలలా జీవించలేక అతి దీనావస్థలో ఆత్మాహుతికి పాల్పడుతున్నారు అనేకమంది నిరుద్యోగులు. ప్రథమ ప్రణాళిక నాటికి 80 లక్షల నిరు ద్యోగులుంటే, ద్వితీయ ప్రణాళిక నాటికి వారు 120 లక్షలకు పెరిగారు. మూడవ ప్లాను నాటికి 150 లక్షలకు, నాల్గవ దాని నాటికి అది రెండు కోట్లకు పెరిగింది. 1990 నాటికి 8 కోట్ల మంది నిరుద్యోగు లుంటారని అంచనాలు వెలువడినాయి. నిరుద్యోగ సమస్య పరిష్కార మవుతుందనే ఆశ నిరాశ అవుతున్నది. వేసుకున్న ప్రణాళికలు తల్లక్రిందు లవుతున్నాయి. నిరు ద్యోగ సమస్య నిచ్చెన మెట్లలా పైపైకి పెరిగి పోతున్నది. ఇప్పటి జీవన ప్రమాణాన్ని అయినా నిలుపుకో గల్గుతామని ఒక్క అశావాది మాత్రమే కలలు కంటున్నాడు. కాని, ఆలోచిస్తే ముందుతరాల వారి భవిష్యత్తు ఇంకా అంధ కార బంధుర మవుతుందనక తప్పదు. సహజ వనరుల కంటె రోజు రోజుకు ముందుకు పొయ్యేది జననాల రంగమే. కనుక, మన ఆర్థిక వనరుల గురించి, పెరుగుతున్న జనాభా గురించి అంచనాలు వేసుకోక పోతే ఎలా అనేది నేడు మన ముందున్న శేషప్రశ్న.

ఈ సమస్యకు పరిష్కార మార్గాలు మూడు గోచరిస్తున్నాయి. మన జనాభాను పోషించే స్తోమతు అయినా ఉండాలి లేక ప్రజలను నశింపు అన్నా చేయాలి. కాకపోతే జననాల అధిక రేటును అరికట్టాలి. పెరుగుతున్న ప్రజానీకానికి వనరులను సమకూర్చటం దుర్ఘటం అని తేలిపోయింది. పోనీ, పుట్టిన వారిని చావనిద్దామనే భావం మానవతకు వ్యతిరేకం. యుద్ధంలో ఒక వ్యక్తి మరణించినా, ఆఖరుకు ఎనభయి ఏండ్ల మన తాతయ్య చనిపోయినా

"ఆమ్యో" అని విచారిస్తాం. కాగా, మధ్యే మార్గంగా జన్మ నిగ్రహమే ఉత్తమమైనదిగా, ఆచరణ యోగ్యమైనదిగా భావించాలి.

ఇది స్త్రీల విముక్తి ఉద్యమంగా భావించాలి. అధిక సంతానం వల్ల స్త్రీ శారీరక మానసిక రుగ్మతలకు లోను అవుతుంది. విశ్రాంతి లేమిచే ఆమె తన సాంఘిక, ఆర్థిక రాజకీయ హక్కులపై ఆసక్తి చూపలేదు. బహు సంతాన భారంతో పిల్లలపై శ్రద్ధాసక్తులు చూపలేదు తల్లి. తగిన విద్యాబుద్ధులు లేని పిల్లలు సంఘ విద్రోహులుగాను, సోమరిపోతులుగాను, మూర్ఖులుగాను తయారై అవిశ్వాస పాత్రులు అవుతున్నారు. మోయలేని బరువు భారంతో పురుషుడు కృంగి కృశిస్తూ జీవితానందాన్ని పొందలేక పోతున్నాడు. అలా వ్యక్తి, కుటుంబం, దేశం, ప్రపంచం కూడా అధోగతి పాలు అవుతున్నాయి. ఈ నాడు వున్న ఈ పరిస్థితులు ఇంకా రోజురోజుకూ విషమిస్తున్నాయి. కనుక తిరిగి కుటుంబ నియంత్రణ ఉద్యమాన్ని మహిళలు ప్రజా సంఘాలు ఉవ్వెత్తున లేపాలి. అందుకు ముందుగా కొంత పూర్వ చరిత్ర గతిని పరిశీలించి మార్గాన్వేషణ చేద్దాం.

ఈ ఉద్యమం 1914లో మార్గరేట్ శాంగర్ చేత ప్రారంభించ బడింది. ఆనాడు ఆమెపై అనేక విధాలైన తిరుగుబాటు వచ్చింది. తర్వాత దరి దాపు ప్రపంచ రాజ్యాలన్నీ ఆమోదించాయి. 1940 నుండి మన దేశంలో ఈ భావవ్యాప్తి జరిగింది 1951లో ఈ సమస్య ప్రాధాన్యతను గుర్తించిన ప్రభుత్వం 1956 నుండి కార్యక్రమ నిర్వహణకు నిదులు కేటాయించింది. మొదట్లో రక్షిత కాలపద్ధతి, తర్వాత జన్మ నిగ్రహ సాధనాలు, పిదప 'లూప్' అమర్చు విధానం, తదుపరి గర్భస్రావాన్ని చట్టబద్ధం చేయటం జరిగింది అయినా స్త్రీ పురుషులకు ఆపరేషన్లే క్షేమమని, శ్రేయస్కరమని తేలింది. ఉద్యమం పుంజుకున్నది. తారస్థాయికి చేరింది, ఆపరేషన్లు చేయించు కునే వారికి సౌకర్యాలు, కొంత భృతిని కల్పించింది ప్రభుత్వం. ఇవన్నీ, ఉద్యమ ప్రోద్బలానికి మంచి పనులే. అయినా విస్తరణలో కొన్ని పొరపాట్లు జరిగాయి. అధికారులకు కోటాలు నిర్ణయించారు. దాంతో అధికారులు ప్రజలపై ఎగబడ్డారు కేసుల కోసం. ముూకుమ్మడి క్యాంపులలో వేలకు వేలు ఆపరేషన్సు జరిగాయి. తర్వాత "ఫాలో అప్" దూరమై పోయి

పురణాలు కూడా సంఘటించాయి. ఉద్యమ తీవ్రత తగ్గింది, మళ్ళీ పుంజు కోవటానికి చాలా కాలం పట్టింది. కనుక ప్రస్తుత మన కర్తవ్యాన్ని గూర్చి ఆలోచిద్దాం.

అపరేషన్ల కార్యక్రమం ఏమాత్రం కుంటుపడ్డా ప్రణాళికలు తారు మారు అవుతాయి. దేశ ప్రగతి ఆగిపోతుంది. పౌరులకు, కుటుంబాలకు, ప్రభుత్వానికి ఇక్కట్లు పెరుగుతాయి. ప్రజలలో ఉన్న అపోహలను పోగొట్టాలి. అపరేషన్లవారికి వనరులు, సదుపాయాలు, పెంచాలి. అవసరమైతే నిధులు ఇంకా పెంచాలి. కార్యక్రమాన్ని అమలు పరిచే ఉద్యోగుల నియామకం చేసేటప్పుడు ఆ ఉద్యమంలో విశ్వాసం వున్నవారినే నియమించాలి. ప్రబోధ కార్యక్రమాన్ని భారీగా నిర్వహించాలి. స్కూళ్ళల్లో, కాలేజీలలో లైంగిక విజ్ఞానంపై బోధలు విరివిగా జరగాలి. ప్రబోధంపై నొక్కు పెంచాలి గ్రామ నాయకులు, పార్టీల నాయకులు, స్వచ్ఛంధ సంస్థల వారూ అందరూ ఇది తమదిగా భావించి కృషి చెయ్యాలి. వారు తమ జీవితంలో తమ కుటుంబంలో మున్ముందుగా కుటుంబనియంత్రణ అమలు జరపాలి పాటించిన ఉద్యోగులకు సౌకర్యాలు ఇవ్వడమే కాక పాటించని వారికి కొన్ని అనర్హతలు అంటే ఇంక్రిమెంట్లు, ప్రమోషన్లు, గృహవసతి, ఉచిత వైద్య సౌకర్యాలు, ఉద్యోగినికి ప్రసూతి సెలవలు లాంటివి ఇవ్వరాదు. మొదటి పిల్లకు మాత్రమే ఇవ్వాలి. ఇలా కొన్ని కఠిన నియమాలు ప్రకటించక పోతే లాభం ఏమాత్రం వుండదు.

ముఖ్యమైన ఆలోచన ఒకటి వుంది. అది మంచి ప్రచారంలోకి రావాలి. ప్రభుత్వం చేపట్టాల్సిన పని అది. అంతేకాదు. స్వచ్ఛంద సంస్థల సహాయం, ఆమోదం దానికి లభించాలి. నిర్బంధ ఉచిత అపరేషన్లు, (కంపల్సరీ స్టెరిలైజేషన్స్) జరపాలి. కలరా, మశూచికి టీకాలు ఎలా వేయిస్తామో అలాగే ఒక్క పిల్ల పుట్టగానే అపరేషన్ జరగాలి. ఇది అవశ్య కర్తవ్యం. అంతకన్నా మరో మార్గంలేదు. ప్రజలు స్వచ్ఛందంగా అపరేషన్లు చేయించుకోవాలంటూ ధర్మోపదేశాలు చేస్తూ వుంటే జరిగేది ప్రళయమే. అందులో రాజ్యాలే కొట్టుకు పొయ్యే ప్రమాదం వుంది. కనుక భవిష్యత్తును గురించి ముందు చూపు గలవాళ్ళం ఇలా ఆలోచించాలి. ఇప్పటికే

పుట్టి మునిగింది. ఇలాంటి హెచ్చరికలు, గుణపాఠాలు వమ్ము చేస్తే మనమూ, మన ముందుతరాలూ అధోగతిపాలు అయ్యే ప్రమాదం వుంది. కనుక ఇది కేవలం ప్రభుత్వ బాధ్యతగా భావించరాదు. ఈ కార్యక్రమాన్ని పాలనా నిర్వాహకులు, స్వచ్ఛంద సేవకులు, ముఖ్యంగా స్త్రీలు సమర్థతతో, దృఢ నిశ్చయంతో అమలు పర్చడం చాలా అవసరం. స్త్రీ విద్య స్త్రీల వివాహ వయస్సు పెంచటం ముందుగా జరగాల్సిన పనులు. స్త్రీల ఉద్యోగావకాశాలు పెంచటంకూడా చాలా ముఖ్యమైన విషయం. ఇంటిపని, బైటిపని చేస్తున్నందువల్ల వారు హెచ్చు సంతానాన్ని కనరు. అంతేకాదు, విద్య ఉద్యోగం లాంటి వాటివల్ల స్త్రీల హోదా, స్థాయీ కూడా పెరుగుతాయి. ప్రభుత్వ ప్రచార సాధనాలు, సంస్థలు సమధిక ఉత్సాహంతో శక్తి వంచన లేకుండా కృషి చేయాలి. ఇలా అన్ని రంగాలలో సర్వతోముఖ కృషి జరిగితేనే ఈ కుటుంబ నియంత్రణ ఉద్యమం ఫలిస్తుంది.



మనిషి ఆశించేది సుఖం. స్త్రీపురుష సాహచర్యంవల్ల అదిసిద్ధిస్తుంది. ఫలితంగా సంతానం ఉద్భవిస్తుంది. పిల్లల హోదాను క్రమబద్ధం చేయటానికి పెళ్ళి పద్ధతి పుట్టింది. అలా కుటుంబం ఏర్పడింది. కాలోచిత అవసరాలదృష్ట్యా అధిక సంతానాన్ని ఆశించారు ఆనాడు. తల్లి పిల్లల ఆరోగ్యాన్ని గురించి, దానికి ప్రాతిపదికగాగల పోషకాహారాన్ని గురించి శ్రద్ధ ఎక్కువయింది. అధిక సంతానంతో చిక్కులు ప్రారంభమయ్యాయి. జనాభా ప్రళయం ముంచుకొని రాసాగింది. ప్రజాస్వామ్యం ప్రమాదంలో పడింది. పౌరులూ, దేశాలూ, ప్రపంచమూ విషమ స్థితిలోకి దిగజారాయి. ఈ అరిష్టాలను అరికట్టడానికి జాతీయ జనాభా విధానం ఆవశ్యకం అయింది. అందరి శ్రేయస్సుకోసం ముఖ్యంగా స్త్రీల కొరకు కుటుంబ నియంత్రణను చేపట్టాల్సి వచ్చింది. చిన్న కుటుంబ తత్వం అలవర్చుకోవడం ఆరంభమయింది. గర్భ నిరోధం, జన్మ నిగ్రహం పరిగణనకు వచ్చాయి. గర్భస్రావం ఆదరణీయమయింది. అనుమానాలు అపోహలు వెలిశాయి. అభ్యంతరాలు, ఆటంకాలు రంగం మీదికి వచ్చాయి. తల్లే పిల్లలను చంపితే నీతికి స్థానమెక్కడ అని మతవాదులు ప్రశ్నించ సాగారు. జనాభా విద్య బోధనాంశమయింది. ప్రసార సాధనాలు చేయూత నిచ్చాయి. ఆలోచన సాగింది, ప్రశ్నలు పుట్టాయి. పెళ్ళి కేవలం పిల్లల కోసమేనా అనే ప్రశ్న బలం పుంజుకుంది. స్త్రీలు చైతన్యవంతులయి, తమ వ్యక్తి వికాసానికి, సంక్షేమానికి, ఆరోగ్యకర జీవనానికి కృత నిశ్చయు లవుతున్నారు. ఈ పరిణామం పరమోత్కృష్టకరం.